## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **మోహన్ పబ్లికేషన్స్** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **మోహన్ పబ్లికేషన్స్** వారి వెబ్ సైట్: http://www.mohanpublications.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం ఉచితంగా eBook రూపంలో **మోహన్ పబ్లికేషన్స్** వెబ్ సైట్ వారు అందించటం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు వారికి గలవు,కనుక వారిని సంప్రదించగలరు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## మోహన్ పబ్లికేషన్స్ వారి వెబ్ సైట్:

[http://www.mohanpublications.com/](http://www.mohanpublications.com/)

Mohan Publications - E Bo

www.mohanpublications.com/ebooks_category.php

mohan PUBLICATIONS

eBook

Share Now

www.మోహన్ పబ్లికేషన్స్.com

Home | About | Book List | E-Books | E-Novels | Order Now

Just Releaded Books | Distribution Books | Premium E-Books | Free E-Books

**Books Catelogue**

- వ్రత కథలు - పూజలు
- స్తోత్రాలు - సుప్రభాతములు సహస్రనామాలు
- శ్రీ సాయి దత్త గ్రంథములు
- జ్యోతిషాలు
- వాస్తులు
- మంత్ర శాస్త్రాలు
- గ్రంథాలు - ఆరాధనలు
- వైద్య గ్రంథాలు

Free E-Books Category

- Devotional & Spiritual Books
- Pujas & Vrathas
- Sahasranama Books
- Jyothisham & Vaastu
- Puranas & Vedas
- Ayurveda & Homeopath

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కలసి జీవిద్దాం

## (వ్యక్తిత్వవికాస విజయమాల)

రచన
**మైత్రేయ**



ప్రకాశకులు : ☎ 246 2565

**మోహన్ పబ్లికేషన్స్**

అజంతా హోటల్ ఎదురుగా,
కోటగుమ్మం, రాజమండ్రి -1

కాపీరైట్ 2012 వెల : 60-00



**కలసి జీవిద్దాం**
**(వ్యక్తిత్వవికాస విజయమాల)**

ప్రధమ ముద్రణ : జూన్ 1994
రెండవ ముద్రణ : ఏప్రిల్ 2006

రచయిత
**మైత్రేయ**
**(శ్రీగురుపద క్షేత్ర)**
**ప్లాట్‌నెం. 101, లక్ష్మి రెసిడెన్సీ**
**మారుతి నగర్, మౌలాలి, హైదరాబాద్**
**సెల్ : 94402 05180, 98851 38117**
**ఫోన్ : (040) 27134225**



ముద్రణ :
**మహేశ్వర ఆఫ్‌సెట్,**
**రాజమండ్రి.**

ప్రకాశకులు :
**మోహన్ పబ్లికేషన్స్**
అజంతా హోటల్ ఎదురుగా, కోటగుమ్మం,
రాజమండ్రి - 533 101.



## ఇందులో విషయాలు

## అభినందన చందనం

భారతీయులు వ్యక్తులే గాని సంఘం కాదు అనే విమర్శ ఉన్నది. ఎవరికి వారు "నేను" కు అగ్రస్థానమిస్తారు మనము అనేమాట వినబడదు కనబడదు చేసే పనులు వైయక్తికములే తప్ప సమిష్టి ఆలోచనగాని, సమిష్టి కృషిగాని అంతగా కనిపించదు.

ఈ దోషాన్ని తొలగించుకోడానికి శ్రీ మధుసూదనానంద గారు రచించిన **"కలసి జీవిద్దాం"** ఎంతైనా ఉపకరిస్తుంది, వెలుగుబాటలు చూపుతుంది. విషయాన్ని ఉదాహరణలతో, ఉపమానాలతో, దృష్టాంతాలతో విడమరచి చెప్పడంలో రచయిత సిద్ధహస్తులు.

మాటలే మిత్రులనుగాని శత్రువులనుగాని సమకూర్చి పెడతాయి. 'నోరా వీపుకు తేకే' అన్న సామెత ఉండనే ఉంది. "మంచి మాటకు ఖర్చులేదు, విలువ అధికం" అని పెద్దలు చెప్పారు. అందుచేత మధుసూదనానందగారు ఈ పుస్తకంలో మనకు మొదట మాట్లాడటం ఎలాగో నేర్పుతారు. "నువ్వు మాట్లాడే మాట నువ్వు విను" అని సూచనచేశారు. మీమాటలు అవతలివాళ్ళకు సరియైన అవగాహన కలిగిస్తున్నాయో, దురభిప్రాయం కలిగిస్తున్నాయో పరిశీలించుకుంటూ ఉండాలి. "మీరు మాట్లాడదలచినప్పుడు ప్రజల స్థాయికి దిగిరండి. లొడలొడ వాగకుండా మాట్లాడే వేగాన్ని తగ్గించండి....మాట్లాడటం ఎంత ముఖ్యమో, ఇతరులు చెప్పేది వినడం కూడా అంతకంటే ముఖ్యం.....వినడం అనే కళ వల్ల మానవ సంబంధ బాంధవ్యాలు బాగుపడినంతగా మరి దేనివల్ల అంత ఉపయోగం ఉండదు" అంటారు వీరు.

చెప్పదలచిన విషయాన్ని ఆసక్తికరంగా, పాఠకులు గుర్తుంచుకునే రీతిలో చెప్పడంలో వీరిది అందెవేసిన చేయి. ప్రేమ ఉన్నచోట పని బరువనిపించదని చెపుతూ ఇలా అన్నారు.

శ్రీరామతీర్థస్వామి ఒకసారి అరణ్యంలోని పర్వతం ఎక్కుతున్నప్పుడు, ఆ కాలిబాటలోనే నాలుగేళ్ళ పిల్లవాణ్ణి వీపున ఎక్కించుకొని ముందుకు పోతున్న ఎనిమిది సంవత్సరాల పాప కనిపించింది. మామూలుగా ఒకవ్యక్తి ఆ కాలిబాటలో కొండ ఎక్కి వెళ్ళడమే కష్టమైతే, కేవలం ఎనిమిదేండ్ల వయసుగల ఆ పాప ఆ పిల్లవాణ్ణి ఎత్తుకొని కొండ నెక్కడం ఆయనకు ఆశ్చర్యాన్ని కలిగించి "పాపా! ఆ

పిల్లవాడు నీకు బరువు కావడం లేదా?" అన్నాడు. ఆ పాప "వీడు నా తమ్ముడు, మరి నాకెలా బరువవుతాడు!" అన్నదట.

జీవితంలో మరొకరితో పోటీ పడకుండా తనకు తానుగా జీవించాలని చెపుతూ "అహంకారం ఘర్షణకు, ఘర్షణ పోటీకి దారితీస్తుంది. ఈ పోటీ కారణంగానే ప్రజలు కలిసి బ్రతకలేరు" అంటారు రచయిత.

వీరు వెల్లడించిన విలువైన మాటలతో మరికొన్ని యిలా ఉన్నాయి.

ఆదేశాలు, ఉపదేశాలు, సందేశాలు ఎవరికీనచ్చవు. ప్రజలు మిమ్మల్ని శ్రేష్ఠులుగా ఒప్పుకుంటే కదా మీ నుండి ఇవన్నీ స్వీకరించడానికి, ప్రతివ్యక్తి అహంకారం అనే బురద పూసుకొని తనే శ్రేష్ఠుడననుకుంటారు. కనుక కలిసి జీవింపదలచినవాడు ఆదేశాలు, సందేశాలు, ఉపదేశాలు ఇవ్వడం మానాలి. మీలో తేజస్సు పెరిగినవాడు మీరు తమకన్నా శ్రేష్ఠులనే విషయం వారికి అర్థం కాగలదు. అప్పుడు వారే మిమ్మల్ని సందేశ మివ్వమని అడుగుతారు. కనుక పోటీ పడటం మాని తేజస్సును పెంచుకోవడం మొదలు పెట్టండి.

"విషయం పూర్తిగా ప్రమాణ పూర్వకంగా నిరూపించబడనంత వరకు ఎవరిపైనా దోషారోపణ చేయకండి".

సాధ్యమైనంత వరకు ఎవరినీ విమర్శించకండి. అవసరమైతే ఏకాంతంలోనే ఆ పనిచేయండి.

ఇతరుల మీద బురద చల్లకండి. ఎందుకంటే ముందు మీ చేతులు బురద అవుతాయి."

ఇలా ఈ గ్రంథంలో మనుషులు కలిసి మెలిసి జీవించడానికి ఉపకరించే ఆలోచనలను రచయిత అందించారు. ఇవి ఆచరణ యోగ్యంగాను, హేతుబద్ధం గానూ ఉన్నాయి. వీటిని గ్రహించి పాఠకులు తమ జీవితాలను ప్రకాశవంత మొనర్చు కుంటారని ఆశిస్తున్నాను. ఇంత విశ్లేషణాత్మకముగాను, ప్రబోధాత్మకము గాను రచించిన మైత్రేయ మధుసూదనానంద గారికి అభినందన చందనము సమర్పిస్తు న్నాను.

**-మన్నవ గిరిధరరావు**

మాజీ ఎం.ఎల్.సి

సంపాదకుడు

**"భారతీయమార్గము"**మాసపత్రిక

కృష్ణనగర్

గుంటూరు.

## ముందుమాట

అదంతే...

"భాషాప్రౌఢిమ కంటే, భావవ్యాప్తి సమాజానికి ముఖ్యమని నా నమ్మకం. వివిధ రంగాలలో అపరిమితమైన విజ్ఞానాన్ని అనుభవాన్నీ, వ్యవహార దక్షతను, నిర్వహణ నైపుణ్యాన్ని సముపార్జించిన మేధావులు, ప్రజ్ఞావంతులు తెలుగువారు ఎందరో ఉన్నారు. తమ భాషా సౌష్టవం పైన సంకోచం మాని, సామాజిక చైతన్యానికై వారందరూ తెలుగులో ఆయా విషయ విశిష్టతల మీద రచనా వ్యాసరంగం చేపట్టాలని నా విజ్ఞప్తి" అన్న కె. రామిరెడ్డి గారి మాటలు స్ఫూర్తి నివ్వగా ఈ గ్రంథ రచన సాగింది.

**"విజయంమీది"** వ్రాసిన తరువాత విజయం లభించినా ఆనందం పొంద లేకపోయిన వారి కొరకు **"విజయంమీది"** వ్రాయడం జరిగింది. కలిసి జీవించే కళ నేర్చుకుంటేనే ఆనందం లభిస్తుంది. కనుక "విజయంమీది" లో కలిసి జీవించే కళను గూర్చి కూడా చాలాచోట్ల చర్చించడం జరిగింది. కానీ అక్కడ విషయం సమగ్రంగా లేదేమో అనే సందేహం కలగడంతో **"కలిసి జీవిద్దాం"** రచన మొదలైంది.

మనం ఇతరులతో సంబంధం పెట్టుకునేది నోరు, చెవులతోనే. ఈ రెంటినీ (సారీ.. రెండు చెవులు, ఒకనోరు వెరసి మూడు) సరిగ్గా ఉపయోగించుకోగలిగితేనే మానవ సంబంధాలు సాఫీగా ఉంటాయి అని భావించి మొదటి అయిదు అధ్యాయాలలోనూ, ఇతరులతో సరిగా మాట్లాడటం, జాగ్రత్తగా ఇతరులు చెప్పింది వినడం అనే విషయాన్ని చర్చించాను.

ఆరవ వ్యాసంలో భావప్రాధాన్యత కనిపిస్తుంది. కలిసి జీవించడానికి చేసే ప్రయత్నం మంచిదే కాని దాని కొరకు వ్యక్తి గత స్వేచ్ఛను వదులుకోవలసిన పనిలేదు. "The only sin is limitation". స్వేచ్ఛా రాహిత్యాన్ని మించిన పాపం లేదు. ప్రేమను మించి శ్రేష్ఠమైనది ఈ ప్రపంచంలో మరొకటి లేదు. కానీ ప్రేమ ముసుగులో కొనసాగే మమత్వం, భయం, లోభం వ్యక్తి స్వేచ్ఛను కబళిస్తాయి. అటువంటి సమయంలో స్వేచ్ఛ కొరకు సమస్తాన్ని వదులుకోవడానికి సిద్ధపడాలి. ప్రేమ పునాదుల మీద సహజీవనమనే భవంతి నిలవాలి గానీ స్వేచ్ఛా పునాదులమీద సహజీవనమనే భవంతి నిలవాలి గానీ స్వేచ్ఛా రాహిత్యం మీదకాదు అనే విషయాన్ని ఇందులో వివరించాను.

ఈ సృష్టిలో కొన్ని మౌలిక సత్యాలున్నాయి. అయితే వాటిని ఆచరణలోకి తేవడం చాలా కష్టం అవుతుంది ఆచరించాలనుకున్న వాడికి. అయినా సరే కేవలం మనకు కనిపించే స్థూల ప్రపంచం మాత్రమే సత్యంకాదు ఇంకా చాలా ఉంది. మనం చూసే వాటికి అది (ఆ కంటికి కనిపించనిది) వ్యతిరేకంగా కూడా కనిపించవచ్చు.అది తర్కానికి అందకపోవచ్చు. అయినా అదే సత్యం. ధైర్యంగా దాన్ని ఆచరించినవాడు, అందరి మధ్య ఉంటూ ఎవరికీ అర్థంకాని మరో ప్రపంచంలో జీవిస్తూ కూడా కలిసి జీవించడమే కాదు ఇతరులకు మార్గదర్శనం కూడా చేయగలం. అటువంటి విషయాలు చెప్పేదే ఏడవ వ్యాసం. అందుకే దాన్ని భావాతీతం అన్నాను.

యదార్థంగా మన కెదురయ్యే సాంఘిక సమస్యలు, వృత్తి ఉద్యోగాల్లో ఉండే సాధక బాధకాల మొదలైన వాటిని గూర్చి 8 నుండి 14 వ్యాసాలలో చర్చించాను.

మానసికమైన సమస్యల నుండి బైటపడే సరళ మార్గాలు చూపించడానికి చేసిన ప్రయత్నం 15,16 వ్యాసాలు. ఇక్కడితో వ్రాత ద్వారా చెప్పాల్సినదంతా చెప్పాను. ముఖ్యమైన ఇంద్రియాలైన చెవులు, నోరు, మనస్సు, బుద్ధిని ఉపయోగిస్తూ కలిసి జీవించే విధానాలివి.

"You can learn a lot just by watching" (చూసి చాలా నేర్చుకోవచ్చు)

ఈ పుస్తకాన్ని కేవలం చదవడమే కాక మీరు ఆచరణలో పెడదామని చూసినప్పుడు కలిసి జీవించడానికి ఇది కొంతయినా ఉపయోగపడుతుందని భావిస్తున్నాను

**మైత్రేయ**
13.6.1994.

" I hear, I forget, I see, I remember. I do, I understand
**-CHINESE PROVERB.**



## 1. మాటలతో మెప్పించండి



" **SEMANTIC APHASIA**"

***"You will get along better if you learn to say your piece with clarity"***

### సీసాల్లో మనుషులు :

ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తితో కలిసి జీవించాలంటే ఇతరుల నుండి తానేమి కోరుకుంటున్నాడో, ఇతరులకు తానేమి ఇవ్వగలడో (ఇవ్వదలిచాడో) స్పష్టంగా చెప్పగలగాలి. ఇలా సంబంధాలు నెలకొల్పడానికే భాష ఏర్పడింది. కానీ ప్రస్తుతం ఒకరు చెప్పేది మరొకరికి అర్థం కాకుండా ఉంది. లేదా వినకుండానూ ఉన్నారు. దీనివల్లే మానవ సంబంధాలు దెబ్బతింటున్నాయి. దీన్నే టైమ్ అనే పత్రిక " Semantic Aphasia" అంటుంది. "ప్రస్తుతం పదాలు అర్థాలకన్నా అనర్థాలను కలుగజేస్తూ, ప్రజలను విడదీసి ఒంటరివాళ్ళను చేస్తున్నాయి" అంటుందా పత్రిక. " It is as if some power had dropped around transparent cylinder about us so that words trying to reach us hit the cylinder and bounce away"

"అదేదో శక్తి ఒక్కొక్కరి చుట్టూ అద్దాల కవచాన్ని ఏర్పరచినట్లు, అందుకే చేరవచ్చే శబ్దాలు వాటిని తగిలి మనసుకు చేరకుండానే వెనుదిరుగుతున్నట్లు అనిపిస్తుంది".

### రమ్యమైన రస్సెల్ కథ :

ఇలా అర్థం కాని మాటలనుగూర్చి 'రస్సెల్' ఒక చక్కని కథ చెబుతారు.... ఉద్యోగం నుండి రిటైరైన ఒక ఒంటరి వ్యక్తికి ఏమీ తోచటేదట. ఆయన తన మనోరంజనం కొరకు వస్తువుల పేర్లు మార్చి పెట్టుకోవడం మొదలెట్టాడు. అన్నాన్ని కుర్చీఅని, కుర్చీని అన్నం అని అన్నాడు. "హా! హా! ఈరోజు నేను కుర్చీని తిన్నాను, అన్నంలో కూర్చున్నాను" అనుకున్నాడు. అలాగే అన్ని వస్తువుల పేర్లు మార్చి పెట్టుకున్నాడు. ఒక లిస్టు తయారుచేసి వస్తువుల పేర్లు అసలు పేర్లకు ఎదురుగా తాను మార్చిన పేరు వ్రాశాడు. కొత్తపేర్లు అలవాటయ్యే వరకు ఆ కాగితాన్ని ఉంచి తరువాత చించివేశాడు. ఈ మధ్యకాలంలో ఆయన అసలు బయటికి వెళ్ళలేదు. ఎవరితోనూ మాట్లాడలేదు. ఇప్పుడు ఆయనకు పూర్తిగా కొత్త మాటలే అలవడ్డాయి పాత వాటిని పూర్తిగా మరిచిపోయాడు. ఇంతలో ఆయన జబ్బు చేయడంతో మంచాన పడ్డాడు. ముసలాయనకు ఏమైందీ చూద్దామని లోపలికి వచ్చిన వ్యక్తులకు ఆయన ఏం చెబుతున్నాడో ఒక్కముక్క కూడా అర్థం కాలేదు. ఈయనకు పిచ్చి ఇక లాభంలేదంటూ వారంతా ఆయన్ను విడిచి వెళ్ళిపోయారు.



ప్రస్తుతం మనందరి పరిస్థితి ఇలాగే ఉంది. ఆఫీసర్ చెప్పేది క్రింది పనివారికి అర్థం కాదు-వారిది ఆఫీసరుకు, భార్యది భర్తకు, భర్తది భార్యకు అర్థంకాదు. ఇక కలిసి జీవించడం ఎలా? ఉక్కిరిబిక్కిరి చేస్తున్న జనసమూహాల మధ్యకూడా వ్యక్తి ఒంటరివాడై మిగిలిపోతున్నాడు. నన్నర్థం చేసుకునే వారే లేరా! అనే భావం ముఖంలో కనిపిస్తుండగా దిక్కులు చూస్తున్నాడు.

మరి ఈ పరిస్థితిలో మనం ఏం చేయాలి?

### మాట్లాడు - విను :

"నువ్వు మాట్లాడేమాట నువ్వు విను". చాలామంది మాట్లాడుతూ పోతారు. వారు చెప్పిందే మరోసారి చెప్పమంటే వారికి అది సాధ్యం కాదు. స్వయంగా వారు చెప్పేది వారు వినక పోవడం వల్ల ఇలా జరుగుతోంది.

"నువ్వు వాడిన పదాన్ని ముందు నువ్వు తెలుసుకో" ఒక వ్యక్తి 'సింపుల్‌టన్' అనే పదాన్ని 'అమాయకుడు' అని అర్థం వచ్చేచోట వాడాడు. నిజానికి ఆ పదానికి 'మూర్ఖుడు' అని అర్థం. ఆవిషయం ప్రస్తావిస్తే ఆయన తనకా పదం యొక్క అర్థం తెలియదు అన్నాడు. (అయినా సరే ఆయన ఆ పదం వాడాడు)

"నువ్వు వాడిన మాటలో నువ్వు పొందుపరచదలచుకున్న అర్థం ప్రతిబింబించేలా చెయ్యి". తెలంగాణా ప్రాంతంలో 'బొంద'ను 'గుంట' అంటారు. ఉభయగోదావరి జిల్లాలలో ఉపన్యాసమిస్తూ నేనా పదం వాడితే అంతా నవ్వారు. అక్కడ గుంట అంటే అమ్మాయి అని అర్థం. "తొయ్యడం, దొబ్బటం, నూకటం నెట్టడం" మొదలైనవి పర్యాయ పదాలు, ఆంధ్రప్రదేశ్‌లో ఇందులోని ఒక్కొక్క పదం ఒక్కొక్క ప్రాంతంలో బూతుపదంగా వ్యవహరించబడుతుంది. ఇవి ఎరిగి మాట్లాడాలి లేదా మనం మాట్లాడదలచింది ఒకటైతే వారికి మరొకటి అర్థమౌతుంది.

### అర్థమౌతే :

ఈ విధంగా నిన్ను ఇతరులు అర్థం చేసుకుంటే ఏమౌతుంది? నువ్వు తెలివిగలవాడివని ప్రజలు గుర్తిస్తారు. నువ్వు మాట్లాడే విషయం నువ్వు ఎరుగుదువని వారు గ్రహిస్తారు. (ఈ ప్రపంచంలో చాలామంది తాము ఎరుగని విషయాలను గురించి గంటలకొద్దీ వాగడం కద్దు). అప్పుడు ఈ రెండు విషయాలు ప్రగతికి బాటలు వేస్తాయి.

**ప్రశ్నించుకోండి :**

మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోండి....

1. మీ ఆఫీసర్ మిమ్మల్ని అర్థం చేసుకోగలుగుతున్నాడా?
2. మీ క్రింత పనిచేసేవారు మిమ్మల్ని అర్థం చేసుకుంటున్నారా?
3. మీ ఇంట్లోవారు మిమ్మల్ని అర్థం చేసుకునేలా ప్రవర్తిస్తున్నారా?
4. అలాగే మీరు మీ పై ఆఫీసరును, క్రింత పనిచేసే వారిని, మీ ఇంట్లోవారిని ఎంతవరకు అర్థం చేసుకుంటున్నారు?

ఆలోచించండి.... "అంటే ఏమిటి?" అని వారు ప్రశ్నిస్తున్నారంటే మీరు చెప్పదలచుకున్నది సరిగ్గా మాటల్లో పెట్టలేక పోతున్నారన్నమాట. అలాగే వారు ఎలా, ఏయే మాటలు మాట్లాడటం వల్ల వారి భావాన్ని మీముందు ప్రకటించగలరో మీరు వారికి వివరించి చెప్పగలుగుతున్నారా?

ఏ పద్ధతిలో మాట్లాడితే మీరు పరస్పరం ఒకరినొకరు అర్థం చేసుకోగలరో తెలిసి కూడా మీరాపద్ధతిని ఉపయోగించడం లేదా! ఒకవేళ అదే నిజమైతే మరి ఎందుకని ఆ పద్ధతిని ఉపయోగిండం లేదు? అని మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోండి.

**ఇదీ జవాబు :**

మీరు చెప్పినదంతా విన్నవాళ్ళను మళ్ళీ తిరిగి ఆ విషయం చెప్పమనండి. అప్పుడు మీరు ఎక్కడ స్పష్టంగా చెప్పలేదో, ఎక్కడ వారు అసలే అర్థం చేసుకోలేదో మీకు తెలుస్తుంది.

**పొగడ్తలు - ఓదార్పులు :**

" Is it people who produce good results feel good about themselves? Or people who feel good about themselves produce good results"

ఉన్నతమైన ఫలాన్ని పొందగలిగినవారు తమను ఉన్నతంగా భావించుకుంటారా? లేక తమను ఉన్నతంగా భావించుకునేవారు మంచి ఫలితాల నిస్తారా? అనేవి ప్రశ్నలు.

తమను ఉన్నతులుగా భావించుకునేవారు అంతటితో తృప్తి పొంది ఏ ఉన్నత కార్యాలు చేయక, సమాజానికి ఏ ఉన్నత ఫలితాలు అందివ్వక



ఉండిపోవచ్చు. కనుక ఒకసారి ఉన్నత కార్యాలు చేసినవారు తమను ఉన్నతులుగా భావించుకుంటారు. అనడమే సబబు.

కానీ అటువంటివారు మళ్ళీ మళ్ళీ ఉన్నత కార్యాలు చేస్తూ సమాజానికి ఉపయోగపడటం కొరకు వారిని పొగడాలి. అది వారికి స్ఫూర్తిదాయకమై ముందుకు సాగగలరు. ఉన్నత కార్యం చేసినప్పటికీ కొందరికి ఫలితం లభించకపోవచ్చు. అయినా అటువంటి వారిని కూడా ఓదార్చాలి.

"Succcess has hundred fathers but failure is on orphan"

విజయం పొందినవాణ్ణి అంతాసన్మానిస్తారు. కానీ అపజయం పొందినవాణ్ణి వెలివేస్తారు. పొగడ్తలు, ఓదార్పుల అనే ఆయుధాలతో ప్రపంచాన్నే జయించవచ్చు. కానీ అహంకారులై ఉండి కేవలం తమను ఉన్నతులుగా భావిస్తూ, సమాజానికి ఏ విధంగానూ ఉపయోగపడని వారి దగ్గర మాత్రం ఈ రెండూ ఉపయోగించ కూడదు.



**ఇష్టపడతారు :**

"నాకేదైనా పని చెబుతారా!"

"నేను చేయదగ్గ పనేదైనా ఉందా!"

" నేను ఖాళీగా కూర్చోలేను బాబు!" నాకేమైన పని చెప్పండి".....

మొదలైన మాటలను అంతా ఇష్టపడతారు. పనిచేసే వారికన్నా ప్రేమగా చేస్తామనే వారే ఎక్కువగా గౌరవించబడతారు. (అలాఅని పనితప్పించుకు తిరుగుతూ కేవలం మాటలు చెప్పమనికాదు)

**ఇష్టపడనిది :**

మీ వెనుక జరిగే ప్రచారాన్ని పట్టించుకోబోకండి. అదేమని అడగబోకండి. ఇలా అడగబడటాన్ని ఎవరూ ఇష్టపడరు.

"It is Royal to be good and to be abused"

"మంచి చేసి విమర్శింపబడటం గౌరవప్రదం."

ఒకవేళ మీరు అదేమని వారిని ప్రశ్నిస్తే తామలా అనలేదంటారు. అంతేకాదు భవిష్యత్తులో వారి ద్వారా జరగాల్సిన పనులు ఆగిపోతాయి. అందువల్ల ఎవరికీ ఉపయోగం ఉండదు.

కలిసి జీవించడానికి ఇది మొదటి మెట్టు

## 2. మాట్లాడటం ఒక కళ

By words the mind is excited and the spirit elated
Aristophanes (5th centuty B.C. dramatist)

### వారికి అర్థంకావడం ముఖ్యం :

కలిసి జీవించాలంటే మీరు తక్కినవారందరికీ అర్థం కావాలి. కనుక మీరు మాట్లాడే మాటలు మీ పాండిత్యాన్ని, భాషా ప్రావీణ్యాన్ని నిరూపించేదిగా కాక మీ భావాలను అందరికీ అర్థం అయ్యేలా చూపగలగాలి.

చాలా పుస్తకాల్లో ఎన్నో ఉపయోగకరమైన విషయాలున్నప్పటికీ భాషా కాఠిన్యతవల్లే అవి చదవబడటం లేదు. మనకు తెలిసిన పదాలన్నింటినీ ఉపయోగిస్తూ వ్రాయవచ్చు. కానీ మాట్లాడలేము. (మాట్లాడకూడదు)

### అందుకు కారణాలు :

మీ భాష ఎటు దారితీస్తుందో ఈ క్రింది ఆరు కారణాలు చూస్తే అర్థం అవుతుంది.

### 1. అర్థం తెలియదు :

వినేవారికి మీరు వాడిన పదం యొక్క అర్థం తెలియక పోవచ్చు. ఒకవ్యక్తి మాట్లాడుతూ 'తుషారం' అన్న పదం వాడాడు.దాని అర్థమేమిటో అక్కడ కూర్చున్న వారిలో చాలామందికి తెలియదు. తెల్లవారుఝామున గడ్డిమీద కనిపించే స్వచ్ఛమైన మంచు బిందువు అంటే అందరికి అర్థం అవుతుంది. అదేదానిఅర్థం కూడా. కనుక సాధ్యమైనంతవరకు సాధారణ మానవుడికి అర్థమయ్యే పదాలే వాడండి.

### 2. వినరు :

టి.వి. చూస్తున్న ఇద్దరిలో ఒకడు పక్కవాణ్ణి ఇంతకూ ఇప్పుడతడు ఏమో చెప్పినట్టున్నాడు ఏమిటదిఅంటాడు. మీరు చెప్పేదయినా అంతే. కాబట్టి వారికి ఉత్సాహం కలిగి వినేటట్లుగా మాట్లాడండి.



### 3. మరో అర్థం :

వినేవారు మీరు వాడిన పదానికి మరో అర్థం ఊహించుకోవచ్చు. ఒకసారి ఒక వ్యక్తికి తేలు కుట్టింది. ఆయన వైద్యుడి దగ్గరికి వెళితే వైద్యుడు మందిచ్చి **"కుట్టినచోట పెట్టండి"** అన్నాడు. ఆ పెద్దమనిషి ఆ మందు తీసుకువెళ్ళి గదిలో తనను తేలు ఏ మూలన కుట్టిందో అక్కడ పెట్టాడట. అట్లా ఉంటుంది అర్థం చేసుకోవడం.

ఒక మిల్ట్రీ ఆఫీసర్ సిపాయిల పెరేడ్ చూడటానికి వచ్చాడు. ఒక సరళరేఖలో నిలుచుని ఉన్న సిపాయిలను చూస్తూ ముందుకు వెళ్ళిన ఆయన ఒక సిపాయి ముందు ఆగిపోయి "ఒరేయ్ మూర్ఖుడా ప్యాంటు జిప్పు పెట్టు" అన్నాడాడు ఆ సిపాయి. "ఇక్కడే అందరిముందు పెట్టమంటారాండి అన్నాడు" ఊ! అవును! ఇక్కడే అన్నాడాయన. వెంటనే ఆ సిపాయి క్రిందికి వంగి ఆఫీసర్ ప్యాంటు జిప్పు పెట్టాడు.

ఆ మిల్ట్రీ ఆఫీసర్‌కు సిపాయి ప్యాంటు జిప్ తెరుచుకొని కనిపిస్తోంది. అందుకే జిప్ పెట్టమన్నాడు. సిపాయికేమో ఆఫీసర్ జిప్ తెరుచుకుని కనిపించింది. కనుక జిప్ పెట్టు అన్న పదానికి ఆఫీసర్ జిప్ పెట్టాలని అర్థమయ్యింది. కాబట్టి మన దృష్టి దేనిపైన ఏవిధంగా ఉంటుంది. అనే దానిపైన మనం వినే పదంయొక్క అర్థం మారుతుంది. కనుక మనం అందించదలచిన అర్థం వారికి అందిందా లేదా చూచుకోండి.

### 4. ఊహించరు :

వినేవారు మీరు వాడే పదాన్ని ఊహించకపోవచ్చు. మీరు, మీ గుంపు, మీరు మీ మనుషులు, మీ హితైషులు, మీ బంధువులు, మీ మిత్రులు, మీపార్టీ, మీతో పనిచేసేవారు అని వాడే కన్నా, మీరు మీవాళ్ళు అంటే బాగా నప్పుతుంది. శ్రోతలకు నచ్చని పర్యాయపదాలు మీరు వాడినప్పుడు, ఆ తరువాత ఇక మీరేం చెబుతున్నారో వారు వినడానికి సిద్ధపడరు. కనుక ఆ ప్రాంతీయులకు ఏ పదాలు నచ్చుతాయో గ్రహించి వాటినే ఎంచుకొని జాగ్రత్తగా మాట్లాడండి.

### 5. స్థాయి దించండి :

మీరు మాట్లాడదలచినప్పుడు ప్రజల స్థాయికి దిగిరండి. కడుపులో నొప్పి వస్తున్న ఒకావిడ డాక్టర్ దగ్గరకెళితే అన్ని టెస్టులు చేసి మందులు వ్రాసి ఇచ్చింది. అసలు జబ్బేమిటి డాక్టర్ అని అడిగితే ఆవిడ "సిస్ట్ ఇంద ఓవరీస్"అంది. బాగా ఇంగ్లీషు వచ్చిన వారికి కూడా ఆపదం యొక్క అర్థం తెలియదు. ఆ పదాలు

కేవలం మెడికల్ డిక్షనరీలో లభిస్తాయి. ఇటువంటి పరిభాషిక పదాలు డాక్టర్లు పేషంట్ల వద్ద చాలా వాడుతుంటారు. ఆ ఎదుటి వారు డాక్టర్లు కారని వారికివి అర్థం కావని వారు గ్రహించలేరు. వారి స్థాయికి దిగిరాలేరు.

న్యూట్రాన్ స్టార్స్ బ్లాక్, హోల్స్‌ను వివరించమంటే యండమూరి వీరేంద్ర నాథ్ "పూరీల పిండిని గట్టిగా రెండు చేతులతో వత్తుతూ పోతే టెన్నిస్ బాల్ సైజు నుండి టేబుల్ టెన్నిస్ సైజుకు కుదించుకు పోతుంది. చూడండి అలాగే న్యూట్రాన్ స్టార్ అంటే అణువులు న్యూక్లియస్ స్థాయికి కుదించబడగా కుంచించుకు పోయిన నక్షత్రం అని అర్థం.

పిండి వడియాలు నూనెలో వేయిస్తే పెద్దగా విచ్చుకుంటాయి. వేడివల్ల వ్యాకోచించడం జరుగుతుంది. భూమి, సూర్యుడు, నక్షత్రాల కేంద్రంలో ఆకర్షణ శక్తి తన చుట్టూ ఉన్న అణువులను తనవైపు లాక్కుంటూ సంకోచింప చేయాలని చూస్తుంది. ఆ గోళంలోని వేడి, అణువులను వ్యాకోచింప చేద్దామని చూస్తుంది. కొంతకాలానికి ఈ వేడి చల్లారిపోగా వెంటనే ఆకర్షణశక్తి విజృంభించి అణువు లన్నింటినీ కుదించుకుంటుంది. క్రమంగా గురుత్వాకర్షణ శక్తి పెరగగా అక్కడ గోళం ఉండకుండా కేవలం ఆకర్షణ శక్తి మిగులుతుంది. దీన్నే బ్లాక్‌హోల్ అంటారు. అది తనవైపుకు వచ్చే కాంతిని కూడా ఆకర్షించుకొని చీకటిని మాత్రమే మిగుల్చుతుంది. కనుక దాన్ని 'బ్లాక్ హోల్' అంటారు. అంటూ వివరిస్తారు. ఇదీ ప్రజలు స్థాయికి దిగివచ్చి విషయాన్ని వివరించడమంటే.

### 6. వేగంగా :

**వేగంగా మాట్లాడటం వల్ల ఈ అనర్థాలు కలుగుతాయి –**

1. వినేవాడికి అర్థంకాదు
2. కేవలం మీకు మాట్లాడే అలవాటు ఉంది కనుక మాట్లాడుతున్నారా లేక నిజంగా తాను అర్థం చేసుకోవడం ఇష్టంలేక అలా మాట్లాడుతున్నారా అనుకుంటాడు మీ శ్రోత.
3. మీరు చెప్పదలచిందంతా వేగంగా చెప్పాల్సిన పనిలేదు. కొన్నయినా అర్థమయ్యేట్లుగా చెబితే చాలు.
4. మీరు వేగంగా చెప్పడం వల్ల మీరు చెప్పింది ఏమిటో అర్థంకాక, మీ తొందర చూసి పని అర్జంట్ అని భావించి, తాను కూడా ఆపని వేగంగా లోపభూయిష్టంగా సగమే చేసి వస్తాడు మీసేవకుడు. లేదా పని తప్పించు



కోవడానికి మీరు చెప్పింది సరిగా అర్థం కాలేదంటాడు లేదా తన పనిలో లోపాన్ని మీవిధానంలో కోపంగా పేర్కొంటాడు. అయితే ఏం చేయాలి?

మీ మాటలను టేపులో రికార్డు చేసి వినండి, మీరు ఎలా మాట్లాడుతు న్నారో మీకు అవగతం అవుతుంది. ఆ తరువాత దాన్ని మీరు మార్చుకోవచ్చు.

మీరు మాట్లాడేటప్పుడు $180^0$ లలో మీరు మీ తలను తిప్పుతూ అందరి ముఖాలలోకి తొంగి చూస్తూ మాట్లాడండి. ప్రతిఒక్కరికీ మీరు వారితోనే మాట్లాడుతున్నారనిపించేలా ప్రవర్తించండి. (ప్రతివ్యక్తి తనకు ప్రాధాన్యత (Attention) ఇవ్వబడాలని కోరుకుంటాడు).

మళ్ళీ మళ్ళీ "మీకు అర్థం అవుతోందా?" అని ప్రశ్నిస్తూ వెళ్ళండి. ఒక విషయం చెప్పిన తరువాత రెండవ విషయం జ్ఞాపకం రాకపోతే "ఒక గ్లాసెడు మంచినీళ్ళు ఇవ్వండి" అనిగానీ "గాలి ఎక్కువగా వస్తోంది ఆ కిటికీ మూయండి" అనిగానీ అనండి. దానితో మీరు తరువాతి విషయం ఆలోచించే సమయం లభిస్తుంది.

చెబుతూ చెబుతూ "ఇందులో ఆరు విషయాలున్నాయి" అనకండి – ఆ తరువాత మీకు కేవలం అయిదే గుర్తుకు వస్తే ప్రమాదం. ఇలాకాక ఆరు పాయింట్స్ చెప్పిన తరువాత "ఈవిధంగా ఇందులో ఆరు విషయాలున్నాయి" అనండి.

**ముఖ్యంగా వేగంగా మాట్లాడేవారి కొరకు :**

**ఆరు రకాలుగా మీరు మాట్లాడే వేగాన్ని తగ్గించుకొనచ్చు.**

1. ఒక ఆలోచనను మీరు కొన్ని వాక్యాలలో వివరించిన తరువాత కాస్త ఆగండి (Give pause) .... ఆవిషయం వారు అర్థం చేసుకోవడానికి కొంత సమయమివ్వండి.
2. ప్రశ్నించండి.... కాస్త ఆగండి! శ్రోతలు జవాబు కొరకు మీరు ఎదురు చూస్తున్నారనుకునేటట్లుగా ప్రవర్తించండి.
3. వారినుండి జవాబు వస్తే వారికి విషయం అర్థమౌతోంది అని తెలుస్తుంది. ఈ విధంగాకూడా మీ మాట్లాడే వేగానికి ఒక బ్రేకు పడుతుంది.
4. వేగం తగ్గించే ఉపాయాలలో అతిముఖ్యమైనది... చెప్పే విషయాన్ని మళ్ళీ మళ్ళీ (Repeatedly) వేరు వేరు మాటలలో చెప్పండి అందువల్ల ఒకే విషయానికి అనేక పదాలు వెతకడం వల్ల మీరు మాట్లాడే వేగం తగ్గడమేగాక ఒకసారి కాకపోయినా మరొక సారయినా వారికి విషయం అర్థమౌతుంది.

5. మీకు టి.వి. అనౌన్సర్స్, న్యూస్‌రీడర్స్ మాటలు అర్ధమౌతున్నాయి కదా! ఎందుకు? జాగ్రత్తగా పరీక్షించండి వారి మాటలను టేపులో రికార్డు చేయండి. మీరు కూడా అవే మాటలు మాట్లాడుతూ టేపు చేయండి. రెండు రికార్డులను వినండి మీకు భేదం తెలుస్తుంది.
6. మీకు వచ్చిన పుస్తకం నుండి 20 పదాలున్న ఒక పేరాగ్రాఫును మీరు మామూలుగా మాట్లాడే వేగంతో చదవండి. గొంతును పెంచుతూ, వేగాన్ని తగ్గిస్తూ మరొకసారి చదవండి. మూడవసారి మరికాస్త వేగాన్ని తగ్గిస్తూ చదవండి. ఈ మూడింటినీ టేపు చేసి వినండి. వేగం ఎలా తగ్గించుకోవాలో అందువల్ల కలిగే లాభమేమిటో మీకు తెలుస్తుంది.



**గ్లోబ్‌లో ఏముంది?**

## 3. వినడం కూడా ఒక కళే మరి !

" He's my friend, the man said "he listens to me"

ఓపికగా మీ మాట వినేవాడిలో ఎన్ని లోపాలున్నా అతడు మీకు మిత్రుడిలా కనిపిస్తాడు. కాని విననివాడు ఎంత మంచి వాడైనా దుర్మార్గుడిలా కనిపిస్తాడు.

**ఎలా వింటున్నారు ?**

మీరు వినేటప్పుడు....

"విసుగుదలతో వింటున్నారా?"

"ఏమాత్రం విషయంలో శ్రద్ధ చూపడంలేదా?"

"మధ్యమధ్య ఏదో రకంగా విఘాతం కలిగిస్తున్నారా?"

ఈ విధంగా వినడం,నేర్చుకోవడానికి మీకుగానీ, మాట్లాడే వ్యక్తిలో ఉత్సాహం నింపడానికిగాని ఉపయోగపడదు.



**సరిగ్గా వినడంవల్ల మీరేం పొందగలరు?**

మానవ సంబంధాలలో అతిబలమైన వంతెన వినడం.

**1. వక్త మిమ్మల్ని ఇష్టపడతాడు :**

వినేవాడి ముఖంలోని శ్రద్ధ "ఓ వక్తా! నువ్వు చాలా ముఖ్యమైనవాడివి" అనే భావాన్ని చూపిస్తుంది. ఈ ప్రపంచంలో అతడి మాటను అతడి భార్యగాని, పిల్లలుగానీ, మిత్రులుగానీ, ఆఫీసులో కలిసి పనిచేసేవారుగాని ఎవరూ వినరు. మీరు వింటున్నారు కనుక మిమ్మల్ని విశ్వశించవచ్చునని, మీ మీద ఆధారపడ వచ్చునని అతడనుకుంటాడు.

**2. మీరు నేర్చుకోవచ్చు :**

"Who learns by finding out has seven fold the skill of him who learns by being told."

తనంతతాను తెలుసుకున్న విషయంలో వచ్చే సామర్థ్యం, వినడం వల్ల వచ్చినదానికి ఏడింత లెక్కువుంటుంది". అనే మాట నిజమైనప్పటికీ జీవితాలు గడిచిపోతాయిగాని ఏడు వందల మందిలో ఒక్కడుగూడా విషయాన్ని తనంతటతాను నేర్చుకోలేడు. మనకు తెలిసిన దానిలో నూటికి 99 శాతం వినడం చూడటంవల్లే నేర్చుకున్నామనడంలో సందేహం లేదు.

**3. వక్త గురించి తెలుసుకోవచ్చు :**

తనకు అందిస్తున్న ఆ విషయాన్ని నేర్చుకోవడానికి ఆయన జీవితంలో ఎన్ని కష్టాలుపడ్డారో, ఎవరెవరిని సేవించాడో, ఎన్ని గ్రంథాలు అధ్యయనం చేశాడో తెలుస్తుంది. దానితో మీకు ఆయనపై గౌరవం పెరుగుతుంది. అతడి అలవాట్లు, సామర్థ్యం, శీలం మొదలైనవి మెచ్చుకోవడం మొదలెడతారు.

**4. మీకు సృజనశీలత కలుగుతుంది :**

మనం వినేప్పుడు కేవలం వినడం మాత్రమే జరగదు మన మనస్సు కూడా ఆలోచిస్తూ ఉంటుంది. వక్త యొక్క ఆలోచనలు, మన ఆలోచనా మార్గంలో కొత్త ద్వారాలను తెరవవచ్చు. ఒక్కొక్కసారి అతడు చెబుతున్న దానికి మనకు వచ్చిన ఆలోచనకు ఎటువంటి సంబంధం ఉండకపోవచ్చుకూడా. అయినా అతడి వాక్కే మీ ఈకొత్త ఆలోచనకు నాంది పలికింది అనడంలో సందేహం ఏమాత్రం లేదు.

**5. ఎవరినుండి వినాలి?**

మనకెప్పుడూ పైవాళ్ళు అంటే తల్లిదండ్రులు, ఆఫీసర్లు, అన్నలు మొదలైనవాళ్ళు చెబితే వినడం అలవాటు. కానీ క్రింది వాళ్ళు పిల్లలు, మీ క్రింద పనిచేసేవారు, తమ్ములు మొదలైన వారినుండి కూడా వినడం మొదలెట్టండి.

**ఎలా వినాలి ?**

1. కిటికీలో నుండి ఇంకెటో చూస్తూ కూడా మనం అతడు చెప్పింది వినవచ్చు. కానీ ఆయననే చూస్తూ వినడంవల్ల మనం శ్రద్ధ చూపుతున్నామని గ్రహించి, చెప్పడంలో ఆయన మరింత ఉత్సాహం చూపగలడు.
2. మధ్యమధ్య "ఇదేనా మీరు చెప్పింది?" "ఇదేననుకుంటా మీ ఉద్దేశం" "అరే! ఈ విషయాలన్నీ మీరు ఎలా నేర్చుకున్నారు?" అంటూ ప్రశ్నించండి. అప్పు డాయన మరింత ధైర్యంగా ఉత్సాహంగా కేవలం విషయాన్నే గాక దాన్ని సేకరించిన తన వ్యక్తిగత జీవిత విధానాన్ని కూగా మీ ముందుంచ గలడు. అతడు చెప్పింది మీకు అర్థం కాలేదనుకుంటే "అదికాదు నేను చెప్పింది" అంటూ మళ్ళీ ప్రారంభించగలడు.



3. అంతేకాదు మళ్ళీ మళ్ళీ "ఇది నిజంగా చాలా చక్కటి విషయం!" 'అరే! ఇంత వరకు ఈ విషయం నేను ఎక్కడా వినలేదు!" "ప్రస్తుతం సమాజానికి కావలసింది ఇదే!" "ఈ విషయం అందరికీ చెప్పగలిగితే ఎంత మార్పు వస్తుందో తెలుసా!" అనడం వల్ల మీరు ఇంకా వినడానికి సిద్ధంగా ఉన్నారనే విషయం వక్తకు అర్థమౌతుంది. అంతేకాదు వక్త పూర్తిగా చెప్పడం అయిన తరువాత కూడా "ఇంతేనా! ఇంకా ఏమైనా చెబుతారా"అనండి. ఆయన గనుక మంచి వక్త అయితే అదే విషయాన్ని మరొక కోణం నుండి ప్రారంభిస్తాడు.
4. అతడు చెప్పిన విషయం మీకు కొత్తది కాకున్నా, పెద్ద విలువైనది కాకున్నా, విషయం తప్పయినా అతడికి ధన్యవాదాలు తెలియజేయండి. దానితో ఈసారి ఆయన తప్పక మీకు తెలియని విషయం, పనికివచ్చే విషయం, విలువైన విషయం చెప్పగలడు.

**ఏం చేయగూడదు?**

అతడు చెప్పిన వ్యక్తి పేరో, వస్తువుపేరో, వీధిపేరో తప్పయినా సరే "అతడు గాంధి కాడు-నెపోలియన్" అని అనబోకండి. తాను తప్పు చెప్పానని తెలియగానే ఆయన అవమానంగా భావించవచ్చు. తరువాత చెప్పవలసింది మరిచిపోవచ్చు లేదా చెప్పేది చెప్పడంఆపి మీతో వాదించడానికి సిద్ధపడవచ్చు.

"నాకు తెలుసు" అనబోకండి. అతడు చెప్పేది పూర్తిగా వినకముందే ఆయన ఫలానాది చెప్పబోతున్నాడని, అది మీరెరుగుదురని మీకెలా తెలిసింది? కనుక సరిగ్గా వినడం నేర్చుకోండి.

షేక్స్పియర్ అన్నట్టు "The disease of not listening" "వినని రోగం" (వినకపోవడమే రోగం) గురించి చెప్పడానికి చాలా ఉంది. ఆంగ్లంలో వీటిమీద చాలా పుస్తకాలు కూడా ఉన్నాయి. మీరు చదివి ఇంకా నేర్చుకోవచ్చు.

ఒకటిమాత్రం గుర్తుంచుకోండి. వినడం అనే కళవల్ల మానవ సంబంధ బాంధవ్యాలు బాగుపడినంతగా మరిదేనివల్ల అంత ఉపయోగం ఉండదు. కనుక సరిగ్గా వినండి - కలిసి జీవించండి!

**చెప్పేవాడు చాదస్తుడైనా కనీసం వినేవాడు వివరం గలవాడై ఉండాలి**

## 4. వాగకుండా మాట్లాడటం కూడా ఒక కళే

" The less men think more they talk"

**ఒకసారి వెనక్కు తిరిగి చూసుకోండి :**

"మీలో ఎవరు ఎక్కువగా మాట్లాడతారు?" ఈ ప్రశ్న వేసుకోండి. మీరా? మీభార్యా? మీ పిల్లలలో ఎవరన్నానా? మీ మిత్రులలో ఎవరన్నానా? మీ ఆఫీసులో ఎవరన్నానా?

ఒకసారి వెనక్కు తిరిగి మీరు గడిపిన రోజును గుర్తుకు తెచ్చుకోండి. ఉదయం ఆఫీసుకు లేదా షాపుకు వెళ్ళకముందు మీ ఇంట్లో ఆఫీసుకు వెళ్లాక అక్కడ, భోజన సమయంలో, మళ్ళీ ఆఫీసులో, మిత్రులతోపాటు హోటల్లో, క్లబ్‌లో.... ఎవరు ఎక్కువగా మాట్లాడారు?

వీటన్నింటిలోను మీరు ఎక్కువగా మాట్లాడినట్లు జవాబు వస్తే మాట్లాడటంలేదు. వాగుతున్నారు అని అర్థం చేసుకోండి.ఇక మీరు క్రమంగా మిత్రులను కోల్పోతారు. మీ ఇంటి సభ్యులే మిమ్మల్ని అసహ్యించుకోవడం మొదలెడతారు.

**పాపం ఒకసారి వినేవారి ముఖాలు కూడా చూడండి :**

మీరు మాట్లాడేప్పుడు ఎవరన్నా వినకపోవడం మీ దృష్టికి వస్తే వెంటనే మాట్లాడటం ఆపండి. మెల్లిగా అతడు మీవైపు చూస్తాడు. అప్పటికే మీరు ఆ విషయం పైన ఎక్కువగా మాట్లాడారేమో..... ఆ విషయం తెలుసుకోవడానికి "ఇంకా వింటారా?" అనిఅడగండి.

మొహమాటానికి ఆవ్యక్తి చెప్పమనవచ్చు కూడా. కానీ ముఖంలో ఉత్సాహం లేక కంఠం నీరసంగా పలికితే మీరు ఇప్పటికే చాలా వాగారని గ్రహించండి.



**ఎదురు మాట్లాడరు :**

నేను మాట్లాడేప్పుడు ఎవరూ ఎదురు మాట్లాడరు. అంతా నిశ్శబ్దంగా వింటారు కనుక నేను మంచి వక్తను అనుకుంటే అదిపొరపాటే.అసలు మీరు మీ మాటలతో ఎదుటి వారికి మాట్లాడే అవకాశమే ఇవ్వడం లేదేమో ఆలోచించండి! మీ మాటలు ఎంత మూర్ఖంగా ఉన్నాయంటే, మీతో వాదించడం కూడా వ్యర్థమేనని వారు మౌనంగా ఉన్నారేమో కూడా చూడండి.

**ఊతపదాలు :**

ఒకసారి నేను ఒక పెద్దమనిషి "గురుదక్షిణ యొక్క గొప్పతనం" అనే విషయంపైన మాట్లాడటం విన్నాను. ఆయన 45 నిముషాల ఉపన్యాసంలో 142సార్లు "ఆయొక్క-ఈ యొక్క" అనే పదాలు వాడాడు. అంతేకాదు వ్యాసుడు వేదాలను తెనిగించాడని అన్నాడు. మరోచోట ఇంకొక పెద్దమనిషి రామాయణం వ్యాసుడు వ్రాశాడన్నాడు. ఆ మొదటి వ్యక్తికి తరువాత వివరంగా అతడి లోపాల గురించి చెప్పినప్పుడు "ఊత పదాల వాడకం గురించి నాకుచాలామంది చెప్పారండి కానీ ఎందుకో నన్నవి విడవడం లేదు" అన్నాడు. అప్పుడు నేను "చాలామంది ఆ మాట చెప్పగా మీరు విన్నారే గాని, నమ్మలేదు; నమ్మిఉంటే ఎప్పుడో మార్చుకునే వారు" అన్నాను. అప్పుడాయన "మరి ఇందులో నుండి బైటపడే మార్గమేమిటి?" అన్నాడు నేను ఆయన ఉపన్యాసాలను టేపు చేసుకొని స్వయంగా తన లోపాలను వినడం ద్వారా వాటినుండి బైటపడవచ్చుని చెప్పాను.

అయితే ఇక రెండవ విషయం తప్పులు మాట్లాడటం, మనందరికీ తప్పులు పోతాయి అనడంలో సందేహం ఏమాత్రం లేదు. కాకపోతే వాటిని తగ్గించడానికి మనం బాగా హోమ్‌వర్క్ చేసుకోవాలి. అంటే ఇంటి దగ్గర విషయాన్ని చక్కగా అధ్యయనం చేసుకురావాలి.

**కోన్** (KOAN) :

మొత్తం ప్రపంచ మత, తత్వ సంప్రదాయాలన్నింటిలోను కూడా జెన్ (ZEN) చాలా విచిత్రమైన తత్వశాస్త్రం. అన్ని మతాలకు మత గ్రంథాలున్నాయి గాని దీనికి లేదు. జెన్ ఉపదేశాలను కోన్‌లు (Koans) అంటారు. తర్కబద్ధం కాని ఒక పిచ్చికథ లేదా విచిత్ర పదవిన్యాసం, లేదా మాటలకందని కొన్ని గమ్మత్తయిన సైగలను కోన్ అంటారు. ఈ కోన్‌ల ద్వారా ఆ తత్వవేత్తలు తమ శిష్యులను బుద్ధినుండి దాని తర్కపరిధి నుండి లేపి అనంత మనోరహిత శూన్యంలోకి నెట్టివేస్తారు. ఉదాహరణకు ......

బాగా ప్రఖ్యాతిగాంచిన జెన్‌మాస్టర్ ఒకరు భుజాన గుడ్డల మూట ఒకటి పెట్టుకొని ఒక చిన్న నగరంలోకి ప్రవేశించాడు. ఇద్దరు విద్యార్థులు ఆయనను గుర్తించి, దగ్గరికి వెళ్ళారు. అందులో ఒకడు జెన్ యొక్క అర్థం ఏమిటి. (What is the significance of Zen?) అని అడిగాడు. వెంటనే ఆ మాస్టర్ భుజాన ఉన్న గుడ్డల మూట తీసి నేలకు విసిరికొట్టాడు. తరువాత రెండవవాడు "మరి జెన్‌ను సాక్షాత్కరించుకోవడం ఎలా? (What is the actualization?) అన్నాడు. వెంటనే ఆ మహాత్ముడు గుడ్డలమూటను భుజాన వేసుకొని తన దారిన తాను వెళ్ళాడు.

మనసు అనే బరువును తీసి పారవేసి అమనస్కులు (మనస్సు లేనివారు) గా మారడమే జెన్ అంటే. ఈ స్థితికి చేరుకున్నవారు జనజీవన స్రవంతిలో కలిసిపోయి, అహంకార రహితులై సాధారణ మానవులుగా యధావిధిగా పనులు చేసుకొని పోవడమే 'జెన్'ను సాక్షాత్కరింపచేసుకోవడం. ఈ రెండు విషయాలను ఆ మాస్టర్ బట్టలమూటను పారవేసి, మళ్ళీ ఎత్తుకోవడమనే కోన్ (Koan) ద్వారా సూచించాడు.

వాగడం మాని మాట్లాడటమంటే ఇది. విషయాన్ని చెప్పడానికి పదిమాటలు అవసరం లేదు ఒక్కటి చాలు.

### T.V లో వాగుడు

మీరు టి.విలో సంభాషణలు (Interviews) చూసే ఉంటారు. పది మాటలలో అడగగల ప్రశ్నను 50 మాటలలో సాగదీస్తారు ప్రశ్నించేవారు. కెమేరా అంతసేపు తమవైపుతిరిగి ఉండాలి. తాను ఎక్కువ సమయం వరకు టి.విలో కనిపించాలి అనే కోరిక తప్ప మరొకటేదీ కనిపించదు వారి ప్రశ్నల్లో.

### మరి ఈ వాడుగు తగ్గించుకోవడం ఎలా?

"నేను ఎక్కువగా వాగుతున్నానా (మాట్లాడుతున్నానా)" అని ఇతరులను అడగండి. వారు అవునంటే (అవుననకపోయినా అలాంటి సూచన అందితే) ఈ క్రింది ఉపాయాలతో వాగుడు తగ్గించుకోవడానికి ప్రయత్నించండి.

### ముద్దంటే నాకిష్టం :

ఒక మంత్రిగారు ఉపన్యాసాలకు ఎక్కడికి వెళ్ళినా ఆయన భార్య వెంట ఉండేది. ఆయన ఉపన్యాసం కొంత కొనసాగిన తరువాత ఆవిడ ఒక కాగితం



మీద **"ముద్దు"** (Kiss) అని వ్రాసి స్టేజిమీదికి పంపేది. వెంటనే ఆయన తన ఉపన్యాసాన్ని 5-6 నిమిషాలలో ముగించేవారు. చాలా రోజులు ఈ వ్యవహారం నడిచిన తరువాత మంత్రిగారి సెకరెటరీ 'ముద్దు' కు అర్థమేమిటని అడిగితే ముఖ్యమైన విషయాలు తప్ప మరీమే వద్దు (keep it simple stupid) అని **"ము....ద్దు"** అక్షరాల మధ్య 13 అక్షరాలు ఉన్నాయని చెప్పారట.

కనుక మీకు తెలియకుండానే మీకు ఉద్రేకం ఎక్కువయ్యి వాగుతూ ఉంటే, ఎవరినైనా గడియారం ఊపడం ద్వారాగానీ, లేక ఒక వేలు పైకి లేపి చూపించడం ద్వారాగానీ, వాగుడు తగ్గించమని హెచ్చరించేలా చెప్పిపెట్టండి. వెంటనే మీ నాలికకు పగ్గాలువేసి జోరునాపండి.

### రెండింతల నష్టపరిహారం :

మీరు ఎంతసేపు మాట్లాడితే అంతకు రెండింతల సమయం (Double) ఎదుటివారిని మాట్లాడనివ్వాలి. ఇకమీరు ఇన్నాళ్ళూ ప్రజలను మీ వాగుడుతో ఎంత బాధించారో తెలుస్తుంది. క్రమంగా మీరే మాట్లాడటం తగ్గించగలరు.

### ఆగితే పాపం :

మీ వాగుడు మధ్యన మీరు ఊపిరి పీల్చుకోవడానికి ఒక్క క్షణం ఆగితే (Pause) చాలు, వెంటనే ఎదుటివారిని మొదలు పెట్టమని ముందేచెప్పి ఉంచండి. దానితో ఎదుటివారు కూడా మాట్లాడవలసింది ఉన్నది అనే విషయం మీకు గుర్తుకు వస్తుంది. మీ వాగుడుకు పగ్గాలుపడతాయి.

### సెన్సార్ :

ప్రశ్నలను, జవాబులను కూడా సాధ్యమైనంతగా కుదించడం అలవాటు చేసుకోండి. ప్రారంభంలో అది అంత సులభమైన విషయం కాకున్నా మీకది క్రమంగా అలవడగలదు.

### ఒకే విషయం :

అనేక విషయాలు (Point) కొద్ది మాటలలో ఇరికించిగానీ, లేక ఒకే విషయాన్ని అనేక మాటలతో సాగదీసి గానీ ప్రజలను బాధించకుండా, స్పష్టంగా ఒకే విషయాన్ని కొద్ది మాటలలో చెప్పి సమాజంలోని ఇతరులతో మీ సంబంధాన్ని, స్నేహాన్ని ధృఢం చేసుకొని, ఆనందంగా జీవించండి.

**బ్రతికిపోయాం :**

ఒక ఫుట్‌బాల్ మ్యాచ్ టెలికాస్ట్ అవుతున్నప్పుడు ఆడియో (శబ్దం) ఆగిపోయి కొన్ని నిముషాల వరకు కేవలం దృశ్యం మాత్రమే మిగిలింది. మళ్ళీ శబ్ధం రావడం మొదలుకాగానే అనౌన్సర్ (వ్యాఖ్యానించేవాడు) మీకు కొన్ని నిము షాల వరకు విశ్రాంతి లభించిందనుకుంటాను అన్నాడు. ఎన్నో వేలమంది "నిజమే అనౌన్సర్ గోల లేకుండా ప్రశాంతంగా ఆట చూడగలిగినందుకు ఆనందిస్తున్నాం" అంటూ టి.వి. స్టేషన్‌కు ఉత్తరాలు వ్రాశారు.

కాబట్టి ఏవాక్కునైతే ప్రేమలో ముంచి ఉపయోగించడం వల్ల అందరినీ ఆలింగనం చేసుకోగలమో, అదే వాక్కును విపరీతంగా ఉపయోగించి అందరినీ దూరం చేసుకోబోకండి.



ఇది ఏమైఉంటుందో చెప్పండి?



## 5. కోకిలలు - కాకులు

None but a fool thiks he is always right

- A poet

మొన్న ఒక పత్రికలో నేను కొన్ని తియ్యటి మాటలు చదివాను. మీరు కూడా చదవండి మరి...

ఒక తియ్యటి మాట "దయచేసి" (PLEASE)

రెండు తియ్యటి మాటలు "మీకు ధన్యవాదాలు" (THANK YOU)

మూడు తియ్యటి మాటలు "నువ్వంటే నాకు ఇష్టం" (I LIKE YOU)

నాలుగు తియ్యటి మాటలు "బహుశ నీదే ఒప్పు కావచ్చు"

(PERHAPS YOU ARE RIGHT)

అయిదు తియ్యటిమాటలు "నిన్ను చూచి నేను గర్వపడుతున్నాను"

( I AM PROUD OF YOU)

ఆరు తియ్యటి మాటలు "నేను తప్పు చేశానని అంగీకరిస్తున్నాను"

(I ADMIT I MADE A MISTAKE)

**శుభోదయం :**

More common a person, the more familiar the person, the less noticeable he becomes.

ఒకే ఆఫీసులో కొన్ని సంవత్సరాలుగా పనిచేస్తున్న వ్యక్తికి తనచుట్టూ ఉండే వ్యక్తులు కనిపించడం మానేస్తారు. అతి పరిచయం వల్లవ్యక్తిగానీ వస్తువుగానీ మాయమైపోవడం సహజమే. కనుక ఒకచోట పనిచేసే మనుషులంతా యంత్రాలుగా మారిపోతారు. తెల్లవారి పనికి వెళ్ళగానే పరస్పరం, ప్రేమగా, తియ్యగా పలకరించుకోవాలనే వారికి గుర్తుండదు.

కానీ మీరు ఆఫీసు కెళ్ళగానే వరుసగా కనిపించిన వారందరితో **"శుభోదయం"**(Good Morning) అంటూ ముందుకు సాగిపోయారనుకోండి మీరంటూ ఒక వ్యక్తి ఉన్నారని, ఇంకా బ్రతికే ఉన్నారని, ఉత్సాహంగా ఉన్నారని అంతా గుర్తిస్తారు. అంతేకాదు పొద్దున్నే తియ్యగా పలకరింపబడటాన్ని ఎవరు మాత్రం ఇష్టపడరు?

అలాగే ఇంటికి వెళ్ళేప్పుడు కూడా తియ్యగా వీడ్కోలు చెప్పండి. మీరు యంత్రాలు కాదు మనుషులమని గుర్తించండి. యంత్రాలు వేటికవి పనిచేయగలవు గానీ మనుషులు మాత్రం ప్రేమతో కలిసి పనిచేయాలి. అందుకు తియ్యగా మాట్లాడాలి ఇలా మాట్లాడే వారే కోకిలలు.

**కొత్త పదాలు :**

ఒకవేళ మీరు ఉదయం ఆఫీసుకు రాగానే అందరినీ పలుకరించే అలవాటులో ఉన్నా ఆపదం కూడా యాంత్రికంగా మారిపోయి ఉంటుంది. ఆ పదం వాడటం వల్ల ప్రజల నుండి ఎటువంటి స్పందన రాదు. కనుక ఆ స్థానంలో కొత్త పదాలు వాడటం మొదలుపెట్టండి. (ఆమ్లెట్ మార్నింగ్ అని లేదా వారు శాఖాహారులైతే చద్దన్నం మార్నింగ్ అని అనవచ్చు).

**దయచేసి - ధన్యవాదాలు :**

ఏదైనా పనిచేసి పెట్టమని కోరేప్పుడు స్త్రీ పురుష, వయో, సాంఘిక స్థాయీ భేదాలు లేకుండా "దయచేసి ఈ పని చేసి పెట్టండి" అని కోరండి. చేయబడిన పని ఎంత చిన్నదయినా సరే ధన్యవాదాలు తెలియజేయండి. ఈ విషయం మీ ఇంట్లో భార్యాపిల్లకు, ఆఫీసులో మీతో పనిచేసే వారికి కూడా వర్తిస్తుంది.

**నా కిష్టం :**

మీరు ఒక వ్యక్తిని ఇష్టపడినంత మాత్రాన సరిపోదు ఆ విషయం తెలియజేయాల్సిన అవసరం కూడా ఉంది. హృదయంతో హృదయం మాటల ద్వారానే ముడిపడుతుంది.

**తప్పు ఒప్పుకునే ధైర్యం - ఒప్పును స్వీకరించగల హృదయ వైశాల్యం;**

" It is said best men are moulded by their faults"

"ఉన్నత మానవులంతా వారి పొరపాట్ల వల్లే మలచబడ్డారు" మానవుడన్న ప్రతివాడూ పొరపాటు చేస్తాడు. కానీ గొప్పవాళ్ళకు తమ తప్పును ఒప్పుకునే



ధైర్యం ఉంటుంది. ఎంత మంది ముందైనా సరే "నేను తప్పు చేశానని అంగీకరిస్తున్నాను" అనగలడతను.కేవలం అహంకారం చేత, ధైర్యంలేక తప్పు ఒప్పుకోక పోవడం వల్లనే మానవ సంబంధాలు చాలా వరకు దెబ్బతింటాయి. తమవల్ల తప్పు జరగగానే మాటల ద్వారా దాన్ని కప్పిపుచ్చుదామని ప్రయత్నించడమో లేక సాక్ష్యాలు సృష్టించి దానిని ఒప్పుగా నిరూపించడమో, లేదా ఆ పొరపాటు జరిగిన స్థలంలోనూ సమయంలోనూ తాను లేనని (Alibi) ఋజువు చేయడమో చేస్తారు కొందరు. "The alibi is just an attempt to prove that you weren't wrong" తాను తప్పు కానని నిరూపించడానికి చేసే ప్రయత్నమే 'ఎలిబీ' కాబట్టి తప్పించుకోవడానికి మనం వినియోగించే శక్తి యుక్తులను "అసలు ఆ తప్పు ఎలా జరిగింది? దానికి దోహదపడిన పరిస్థితులు ఏమిటి?" అనే విషయాలను విచారించడంలో వినియోగిస్తే, మరొకసారి ఆ తప్పు జరగకుండా ఆపవచ్చు.

**సలహాలు, విమర్శలు స్వీకరిస్తున్నారా?**



కాకులు కూడా ఉన్నాయి ఈ సమాజంలో. అవి "కావు-కావు"- "నీవు చేసేవి సరిఅయినవి కావు" అంటూ విమర్శించడం వాటికి అలవాటు. వాటి అరుపులు కర్ణకఠోరంగా ఉంటాయి. అయినా వాటితో కూడా సమాజానికి పనిఉంది. సమాజాన్ని శుభ్రంగా ఉంచడానికి (పాకీ పనికి) కాకులు చాలా అవసరం. విమర్శించేవారే లేకపోతే ప్రతివారు తాము లోపరహితులమనే అనుకుంటారు. వారిలోపాలు (చెత్త) వారికి కనిపించవు. మీరు కోకిలలైనా సరే కాకులతో కలిసి జీవించక తప్పదు. లేదా దీనికి వ్యతిరేకంగా మీరు కాకులై ఎదుటివారు కోకిలలైనా కలిసి జీవించాల్సిందే.

సలహాలను, విమర్శలను మీరు ఓపిగ్గా వినగలిగితే మీరు మంచివారు; ఆ విమర్శను గురించి ప్రశ్నిస్తూ ఎదుటివారు దాన్ని ఇంకా వివరంగా చెప్పే అవకాశాన్ని మీరు కల్పిస్తే మీరు ఉత్తములు; మీకు లభించిన వారి సలహా లేదా విమర్శకు మీరు ధన్యవాదాలు తెలియజేస్తే మీకన్నా ఉత్తమోత్తములు ఈలోకంలోనే లేరు అనవచ్చు.

" Advice is an uncertain gift"

సలహా అనేది అందేది లేనిది తెలియని బహుమతి. కనుక వాటిని స్వీకరించడానికి ప్రయత్నించండి. ఒకవేళ అది ఉపయోగకరమైనదయితే, కేవలం నేను వెళ్ళే మార్గాన్నే అనుసరిస్తాను అనే మూర్ఖత్వాన్ని విడిచిపెట్టి దీన్ని ఆచరించ

ప్రయత్నిండండి. లేదా ఇతరులు మీకు చేసే సహాయాన్ని కాలదన్నుకున్నట్టే అవుతుంది. ఎవరికి తెలుసు! వారు చెప్పేదే ఒప్పు కావచ్చుకదా!

**ఆత్మ విశ్వాసం :**

చాలామంది ఆత్మ విశ్వాసం పేరుతో తాము చేసే తప్పులను ఒప్పుకోరు. ప్రతిక్షణం తాను తప్పు చేస్తున్నానేమో అని మధనపడే న్యూనతా భావం కన్నా ఆత్మవిశ్వాసం వెయ్యిరెట్లు గొప్పది అనడంలో సందేహం ఏమాత్రం లేదు; కానీ ఆత్మ విశ్వాసం పేరుతో విమర్శలను, సలహాలను స్వీకరించకపోవడం, కూడా లోపమే. సలహా స్వీకరించి ధన్యవాదాలు చెప్పండి. విమర్శల నుండి ఏం చేయాలో, ఏం చేయగూడదో నేర్చుకోండి.

**ఎవరిది బాధ్యత :**

ఒక పనిని మనం కలిసి చేస్తున్నప్పుడు, ఎవరి ఆధీనంలోనన్నాపని చెడిపోతే ఆవ్యక్తిని "నువ్వు ఎక్కడ తప్పు చేస్తే ఇలాగయ్యింది!" అని ప్రశ్నించకండి. "మనం ఎక్కడ పొరపాటు పడటం వల్ల ఈ తప్పు జరిగింది? అని అడగండి. అందరూ కలిసి సాధించవలసిన పనిలో తప్పు జరిగితే, బాధ్యత అంతా కలిసి తీసుకోండి. అప్పుడు వ్యక్తులు ధైర్యంగా ముందుకు సాగగలుగుతారు.

**అభిప్రాయాలు - ప్రశ్నల రూపంలో :**

ఎవరైనా ఒక పనిని గురించి వివరించినప్పుడు సూటిగా....
"ఓ! దానికి చాలా సమయం పడుతుంది"
"కొన్ని వేల రూపాయలు ఖర్చవుతుంది"
"నీ ప్లానేమీ బాగాలేదు".....
అనబోకండి
"ఈపని పూర్తికావడానికి ఎంత సమయం పడుతుందను కుంటున్నావు?"
"ఎంత ఖర్చవుతుందనుకుంటున్నావు?"

"నీ ఆలోచన నీకు లోపరహితంగా కనిపిస్తోందా? మళ్ళీ ఒకసారి ఆలోచించు" అనకండి. ఈ విధంగా అభిప్రాయాలు ప్రశ్నల రూపంలో అయితే బాగుంటాయి; ఎవరినీ బాధించవు.

**నాకు కూడా ఎదురైంది :**

ఎప్పుడూ ఇతరుల లోపాలు సూటిగా ఎత్తి చూపకండి. ఎవరైనాతాము ఎదుర్కొంటున్న సమస్య గురించి మీకు చెబితే "నాకు కూడా ఇటువంటి సమస్యే



ఎదురైంది" అంటూ ప్రారంభించండి. "అప్పుడు నేను ఆ లోపాన్ని ఇలా గ్రహించాను; ఇలా దాన్ని సరిదిద్దుతున్నాను; ఇలా ఆ సమస్యను అధిగమించాను" అని చెప్పి ముగించండి. ఎవరూ ఉపదేశాలు వినడానికి సిద్ధంగా ఉండరు కానీ అవే ఇతరుల అనుభవాలుగా వినడానికి ప్రతివారూ సిద్ధపడతారు.

**కుహూ - కుహూ - కావ్ - కావ్ :**

ప్రారంభంలో చెప్పిన ఆరు తియ్యటి మాటలు నేర్చుకొని కోకిలలుగా మారండి. అయినా సరే కాకులతో కలిసి ఉండటానికి సిద్ధపడండి. వారి విమర్శలు, సలహాలు ఓపికగా వినండి. సలహాలకు ధన్యవాదాలు చెప్పండి. విమర్శల నుండి నేర్చుకోండి.

**ఇలా కలిసి జీవించడం ఉత్తమం**



**ఇండ్లా? మనుషులా?**

## 6. అన్నిటికీ అవునవాలా?




"అందరితో కలిసి జీవించాలంటే అన్నిటికీ అవునవాలా? తప్పదా? అనేది ప్రశ్న. కాదు... అలా అవసరం లేదు. "డెసిడెరాటా" ఏమంటోందో వినండి....

"As far as possible without surrender, be on good terms with all persons. Speak your truth quietly and clearly; and listen to others, even to the dull and the ignorant; they too have their story Avoid loud and aggressive persons; they are vexations to the spirit"

సాధ్యమైనంత వరకు ఎవరికీ లొంగకుండా, అందరితో మంచి సంబంధాలు కలిగి ఉండండి. మీరెరిగిన సత్యాన్ని ప్రశాంతంగా, స్పష్టంగా చెప్పండి. అజ్ఞానుల, మూర్ఖుల మాటలు కూడా వినండి. వారు చెప్పుకునే కథలు కూడా ఉంటాయి. పెద్ద గొంతుతో ఉద్రేకంగా వాదించేవారిని దూరంగా ఉంచండి. వారు మీ మనస్సును చెదరగొట్టగలరు.



### సూటిగా సాగిపో :

వ్యక్తిత్వాలను పణంగా పెట్టి తానుసాగే పథాన్ని విడిచిపెట్టి, తాను నమ్మిన విధి విధానాన్ని బలిపెట్టి ఎదుటి వారి మాట వినకపోతే వారేం చేస్తారో అనే భయం చేతనో లేక, నేను వారి నుండి పొందుతున్న సౌకర్యాన్ని సేవను కోల్పోతానేమో అనే లోభం చేత వారికి లొంగిపోయే జీవన విధానం సరి అయినది కాదు. ప్రస్తుతం జీవితంలో ఈ విధానం వల్ల జీవితం సుఖవంతమైనప్పటికీ అది సుదీర్ఘ కాలంలో బానిస బ్రతుకుగా మారి మానసికమైన అస్థిరత్వాన్ని కలిగిస్తుంది.

"ధైర్యంగా ఉన్నవాడు ధనవంతుడు, ధైర్యంలేనివాడు బీదవాడు" అంటుంది అమ్మ. ధనవంతులుగా బ్రతకండి.

### నేర్చుకోండి :

చాలామంది నాకు నేర్పడానికే నా దగ్గరికి వస్తుంటారుగాని నేర్చుకోవడానికి కాదు. (పైకి మాత్రం నేర్చుకోవడానికే వస్తున్నట్లు చెబుతారనుకోండి). ఎంతో దూరంనుండి శ్రమకోర్చి, డబ్బు ఖర్చుపెట్టుకొని వచ్చి మనకు నేర్పేవారు ఎంత కరుణామయులు. వారు కూడా ఒక జీవితం గడిపారు. వారికీ అనుభవాలున్నాయి; వార అనుభవసారాన్ని చిన్న మాటల్లో మనకు అందించడానికి వచ్చారు. గాలి వెలుతురు కావాలి అని కోరుకునేవారు ఇంటికి తలుపులు కిటికీలు తెరిచి ఉంచాలి; అలాగే నలుగురిలో కలిసి జీవించదలచిన వాడు ఇతరుల నుండి నేర్చుకోదలచిన వాడు, ఇతరులు చెప్పేది ఓపికగా వినడానికి సిద్ధంగా ఉండాలి.

### తప్పుకోండి :

ఒక్కొక్కసారి ఆ చెప్పేవారి మాటలో వారి దంభాహంకార ప్రదర్శన, స్వసామర్థ్య ప్రదర్శన మాత్రమే ఉండి పనికి వచ్చేది. ఏమీ లేకపోయినా లేక తలాతోక లేని వాగుడు ఉన్నా కూడా, వారితో కలిసి జీవించదలచినవారు ఓపికగా వారి మాటను వినాలి. వారి గొంతు యొక్క స్థాయి, ఉద్రేకము పెరుగుతున్నాయి అనుకున్నప్పుడు మాత్రం మెల్లిగా అక్కడ నుండి లేచి వెళ్ళి పోవడం మంచిది. లేదా అలా వెళ్ళిపోవడం అనే కార్యం వారిని అవమానించి నట్లవుతుంది అనుకున్నప్పుడు, మనస్సును అక్కడినుండి తప్పించి మరోవైపుకు మళ్ళించే కళ నేర్చుకోండి.

“ఎటువంటి ప్రజ్ఞ లేనివాడి ముఖ్య లక్షణం ఏమిటో తెలుసా?.... ప్రతి విషయాన్ని ఖండించడం” అంటాడు “బారోన్‌షోకాల్ట్”. వ్యక్తులు మాట్లాడేప్పుడు వారిని జాగ్రత్తగా పరీక్షించండి. వారు ఏస్థాయికి చెందినవారో వారినుండి మీరు ఏమి నేర్చుకోవచ్చో మీకు ఇట్టే తెలిసిపోతుంది.

**జాగ్రత్త :**

ఇన్నిటి మధ్య "Better to keep your mouth shut and appear stupid than to open it and remove all doubt" నోరుమూసుకొని కూర్చోవడం వల్ల మీరు మూర్ఖులుగా కనిపించినా సరేగాని,నోరు తెరిచి వారి సందేహాలన్నీ తీర్చకండి. కానీ పరిస్థితి మిమ్మల్ని బానిసత్వం వైపు నెట్టుకు వెళుతున్నప్పుడు లేదా ఎదుటి వారి వాగుడు, మూర్ఖత్వం తారస్థాయికి చేరుకుంటున్నప్పుడు మాత్రం, ఉద్రేకపడకుండా వారిని పక్కకు తీసుకువెళ్ళి ప్రశాంతంగా స్పష్టంగా మీరెరిగిన సత్యాన్ని చెప్పండి. దానివల్ల అక్కడి సమస్య తీరిపోవడమే గాక, భవిష్యత్తులో కొనసాగవలసిన సత్సంబంధాలు దెబ్బతినవు.

We promise according our hopes and perfrom according to our fears

- FRANCOIS





## 7. అంతా ఉల్టా

While livinf be a dead man, Be Thorovghly dead and then behave as you like because then all is well.

- BUNAN

ఈ ప్రపంచం అంతా తల్లక్రిందులుగా ఉన్నది అనే సంగతి ధ్యానం చేసిన వారికి తెలుస్తుంది. ఒకసారి అది గ్రహించినవారు తమ ఇష్టం వచ్చినట్లుగా వ్యవహరించినట్లు ప్రజలకు కనిపిస్తుంది. నిజానికి వాళ్ళు సరిగ్గానే ప్రవర్తిస్తారు కానీ తమకు వ్యతిరేకంగా ఉన్నవారి వ్యవహారం తల్లక్రిందులుగా కనిపిస్తుంది.

**జీవితం - మృత్యువు :**

జీవితాన్ని గురించి తెలుసుకోవాల్సిన పనిలేదు మృత్యువును గురించి తెలుసుకుంటే జీవితం అవగతమౌతుంది. మృత్యువు అంటే మార్పు; ప్రతిక్షణం అది ప్రపంచంలోనూ మన శరీరంలోనూ, మనస్సులోనూ, బుద్ధిలోనూ, కలుగుతూనే ఉన్నది. దీన్ని జీవతానికి వ్యతిరేకంగా భావించక, స్వీకరించగలుగుతూ ఉంటే ప్రతిక్షణం ప్రతి మార్పు భూతకాలంలోకి జారిపోతూ కనిపిస్తుంది. అప్పుడు ప్రతిక్షణం మనకు మనమే నిత్య నూతనులముగా కనిపిస్తాము. ఈ ప్రతిక్షణ నిత్య నూతనత్వంలోనే జీవనం ఉట్టి పడుతుంది.

**భయం లేదు :**

జీవితంలో అంతా భద్రత కోరుకుంటారు. ఇదొక పిచ్చి ప్రపంచం. భద్రత కలిగిన జీవితంలో సారంలేదు. అందులోకి విసుగు ప్రవేశిస్తుంది. స్థిరమైన ఉద్యోగం, సొంత ఇల్లు, బ్యాంక్ బాలెన్స్ యాంత్రిక జీవనానికి, భావదాస్యానికి, మనోరుగ్మతలకు దారితీస్తాయి అభద్రతలో నిలిచినవాడు ప్రతిక్షణం జాగరూకుడై ఉండాలి. ఆకులాగా ఏ క్షణమునైనా గాలికి ఎగరగలిగిన వాణ్ణి కదిలించడానికి ప్రతివాడు భయపడతాడు.

### స్పష్టంగా చెప్పండి :

ఈ తల్లక్రిందులు ప్రపంచంలో మరో విచిత్రం కనిపిస్తుంది. అదే... తన లోపాలను, తప్పులను దాచిపెట్టడం; కపటంతో తనకులేని గొప్పతనాన్ని ప్రకటించ ప్రయత్నించడం. దీనికి వ్యతిరేకంగా ప్రవర్తించి చూడండి. కేవలం అబద్ధాలే ప్రచారమయ్యే ఈ ప్రపంచంలో స్పష్టంగా తన నోటితోనే తన బలహీనతలు, లోపాలు, తప్పులు ఎవడన్నా చెప్పుకుంటాడంటే ఎవరూ నమ్మరు. నువ్వు చెబుతున్నది జోక్ అయినా అయి ఉంటుంది. లేదా ఏదో ప్రయోజనాన్ని ఆశించి చెబుతున్న అసత్యమైనా అయిఉంటుంది అనుకుంటారు అంతా.

### మోసం :

ప్రతివారూ ఈ జగత్తులో తాను మోసంగింప బడకూడదని, వీలైతే ఇతరులను మోసగించాలని ప్రయత్నిస్తారు. మీరు ఇందుకు వ్యతిరేకంగా ప్రవర్తించడండి. ఫలానా వాడికి డబ్బులిస్తే తిరిగి రావని, వాడిచ్చే సరుకు కల్తీదని తెలిసి కూడా వాళ్ళకు ఈ మాటలు చెబుతూ డబ్బు ఇవ్వండి. సరుకు కొనండి. మీకు అవకాశం వచ్చినా సరే ఇతరులను మోసం చేయబోకండి. విచిత్రమైన మీ పద్ధతికి ముందీ జగత్తు ఆశ్చర్యపోతుంది. క్రమంగా మీరే సరిగ్గా ఉన్నారని తామే తల్లక్రిందులని గ్రహిస్తుంది. (ఒకవేళ గ్రహించకపోయినా మీకు వచ్చే ఇబ్బందేమీ లేదు)

### మధ్యలో :

" Man is not the end only the means"

మనిషి గమ్యం కాదు మార్గం మాత్రమే. అందుకే తన మీద తనకు తృప్తి లేదు. గమ్యం చేరిన వాడికి తృప్తి ఉంటుంది. లేదా ఇంకా ప్రయాణం ప్రారంభించని వాడికి శాంతి ఉంటుంది. తానే మార్గమైతే, అలసట, అశాంతి, విసుగు తప్ప మరేముంటాయి. అందుకే తనే తనకు అతీతంగా ఎదుగుదామని చూస్తాడు మనిషి అయితే తాను పైకన్నా ఎదగ గలుగుతాడు. లేదా క్రింద పడిపోతాడు. క్రిందపడి జంతువులా బ్రతకగల్గిన వాడూ ఆనందంగా ఉండగలడు. పైకి ఎదగగలిగిన వాడు కూడా ఆనందంగా ఉండగలడు.కానీ మధ్యలో నిలిచిన వాడికి మాత్రం దుఃఖం తప్పదు.



ఈ తల్లక్రిందుల ప్రపంచంలో మనుషులంతా తల్లకిందులుగా చేతుల మీద నడుస్తుంటే, ఈ మార్గం నుండి ప్రక్కకు జరిగి తన కాళ్ళమీద నిలుచున్నవాడు అందరికీ దూరమైనట్లు కనిపించినా అందరితో కలిసి, అందరికీ మార్గదర్శనం చేయగలడు.

> I contradict my self. I am laege I conrain multitudes.
> -WALT WHITMAN





జింక-అడవి

## 8. ఇదీ మీ ప్రపంచం

> Be your self, Especially do not feign affection Neither be cynical about love.
>
> నీవు నీవుగా ఉండిపో, మరో ముఖ్యమైన విషయం..... ఆప్యాయత నటించకు.
>
> – డెసిడెరాట్టా

**ఏనుగు - ఎలక :**

ఒకసారి ఒక ఏనుగు ఆకులు తింటూ ఉంటే దానికి దగ్గరలో అటూ ఇటూ తిరుగుతున్న ఎలక ఒకటి కనిపించింది. వెంటనే ఏనుగు "ఏయ్! ఇక్కడ నుండి వెళ్ళిపో అర్భకపు ప్రాణి! నేను చూడక నీ మీద కాలు వేశానంటే నలిగిపోతావు" అంది. ఎలక దిగులుగా ముఖంపెట్టి "చిన్నప్పుడు నేను జబ్బు పడ్డాను లేదా నేను కూడా నీ అంత ఉండేదాన్ని" అన్నది.

**కపటం :**

ఇలా ఉంటుంది ప్రజలరీతి. సత్యాన్ని ఒప్పుకొనే ధైర్యంలేదు. ప్రతివాడూ ఏదో ఒకటి అవుదామని చూసేవాడేగాని, తాను తానుగానే నిలిచిపోవడానికి గానీ. తననుతాను ఒప్పుకోవడానికిగానీ సిద్ధంగాలేడు. అంతా కపటంతో నటించే ఈ ప్రపంచంలో ఒకరిని ఒకరు మోసగించుకుందామని చూస్తూన్నారేగాని కలిసి ఉండలేక పోతున్నారు.

జీవితం అంటే ఒకర్ని మరొకరు నమ్మించి మోసగించడం, అందరూ అందర్నీ మోసగించడం అంటాడు షేక్స్పియర్.

**విశ్వాసం :**

వ్యక్తులు బజార్లో కనిపిస్తే చాలు కౌగిలించుకొని ఏడుస్తారు. కానీ మామూలుగా చచ్చారో బ్రతికారో కూడా కనుక్కోరు. నలుగురు చూస్తున్నప్పుడు ఎక్కడ లేని ఆపేక్ష చూపిస్తారు. చాటుగా వారి గొంతు నులమడానికైనా వెనుకాడరు.





ఈ వర్తనంఆధ్యాత్మికత, భక్తి పేరుతో ఆశ్రమాల్లో చేరిన వారిలో కూడా కనిపిస్తూ ఉంటుంది. "We cannot teach old dog new tricks" ఎరిగి ఈ కపట వర్తనంలో ఉన్న ముసలి జంతువులకు మనం కొత్తనీతులు నేర్పలేము. వారిని చూసి మనం ఈవిషయాలు నేర్చుకోకుండా ఉంటేచాలు. లేదా ప్రపంచంలో చాలామంది ఈ కపట వర్తనం లోనే గనుక మునిగి ఉంటే అసలు ప్రేమ ఆప్యాయతలపైన ఎవరికీ విశ్వాసమే లేకుండా పోయి కలిసి జీవించడం అసంభవమౌతుంది.

**మీరూ - లోపాలు :**

అందుకే ....."With all its shame" drudgery and broken dreams it is still a beautiful world be cheerful" లజ్జారహితమైన, హీనవృత్తులు కలిగిన, తీరని కోరికలతో నిండి ఉన్నదైనప్పటికీ ఇది ఒక రకంగా చాలా అందమైన ప్రపంచం. కనుక ఆనందంగా ఉండండి. అంటుంది డెసిడెరాటా.

ఈ సృష్టి నుండి తనను వేరుగా చూచిన వారికే ప్రపంచంలో లోపాలు కనిపిస్తాయి.ఏవ్యక్తీ తనలో తాను లోపాలు వెతకలేడు. తన కండ్లకు తానెప్పుడూ అందంగానే మంచివాడిగానే కనిపిస్తాడు. మరి ఈసృష్టి నుండి తాను వేరు కానప్పుడు దీనిలో ఎవరైనా లోపాలు చూడగలరా?

**దుఃఖం :**

అసలీ ప్రపంచంలో మోసం, దుఃఖం మొదలైనవి లేవు కేవలం అవి చూచే వారిలోనే ఉన్నాయి. మొత్తం సృష్టిలో అన్ని ప్రాణులు ఆనందంగా ఉన్నాయి. ఒక్క మనుష్యుడు తప్ప ఉన్నదున్నట్టుగా ఈ ప్రపంచం జీవరాసులన్నిటికీ ఒక వరం. తక్కిన ప్రాణులకు ఇక్కడ ఇలా ఉండటమే ఆనందం. శ్వాసించడమే ఆనందం. కానీ ఈ ప్రపంచాన్ని చూచే మానవుడిలో దుఃఖం ఉంది. సంస్కృతంలో దుఃఖాన్ని 'వేదన' అంటారు. వేదం అంటే జ్ఞానం. 'న' అంటే అది లేకపోవడం. అంటే జ్ఞానం లేకపోవడమే దుఃఖం. సృష్టిలో ఇతర ప్రాణులకు ఎదుటి ప్రాణుల యొక్క జ్ఞానంలేదు; కేవలం తమకు తాముగా బ్రతుకుతాయవి. ఈ ప్రపంచంలో ప్రతివాడూ తన బ్రతుకు తాను బ్రతికితే దుఃఖమే లేదు; ఈ జ్ఞానం లేకపోవడమే దుఃఖానికి దారితీస్తుంది.

**ఎలా మారిలి?**

మన చుట్టూ ఉండే ప్రపంచం యొక్క జ్ఞానం మనకు మనోవృత్తి (ఆలోచన) రూపంలో ఉంటుంది. ఈ ఆలోచన కారణంగా తన చుట్టూ ఉన్న వ్యక్తులను,

వస్తువులను అలాగే స్వీకరించలేడు. తనకు నచ్చిన విధంగా వాటిలో మార్పును కోరుకుంటాడు. ఇలా కోరుకోబడే ప్రతి వ్యక్తి కోరిక ఇతరుల కోరికకు వ్యతిరేకంగా ఉంటే ఏ కోరిక ననుసరించి ఈ ప్రపంచం మారాలి?

**ఆలోచన :**

అంతేకాదు ప్రతి ఆలోచన ఆలోచించబడే వ్యక్తికి, ఆలోచించేవారికి మధ్య అగాధాన్ని (దూరాన్ని) సృష్టిస్తుంది. దూరం లేకుండా ఆలోచించడం సాధ్యం కాదు. ఈ దూరం ఎంత తగ్గితే అంతగా ఆలోచనలు తగ్గుతాయి.

**దూరం :**

ఒక మెజిస్ట్రేట్ ముందుకు ముద్దాయిగా ఆయన కొడుకును తీసుకువస్తే న్యాయనిర్ణయం చేయడం చాలా కష్టమౌతుంది; వారి మధ్య దూరం తక్కువ, అందువల్ల ఆలోచనలు ఆగిపోతాయి. ఎంత పేరు మోసిన సర్జనయినా తన భార్యకు గానీ, కొడుకుకుగానీఆపరేషన్ చేయలేడు. అందుకు ఇంకొక డాక్టర్ అవసరమౌతాడు; వారి మధ్యకూడా దూరం తక్కువే.

ఇంకెవరన్నా దుఃఖంలోనూ కష్టాలలోనూ ఉంటే మనం సలహా చెప్పగలం కానీ స్వయంగా మనమే కష్టాలలో ఉంటే మనకేమీ తోచదు అక్కడ దూరం అసలే లేదు. అక్కడ మనస్సు పూర్తిగా శూన్యమై పోతుంది.

**విడదీస్తుంది :**

కనుక ఆలోచన మనను ముక్కలుగా చేసి, ప్రపంచం నుండి విడదీసి,ప్రపంచం జ్ఞానం కలిగేలా చేసి, అందులో లోపాలను చూసేలా చేస్తుంది. ఆలోచన, ఆనందాన్ని ఎరుగదు. కేవలం దుఃఖాన్నే ఎరుగును. ఈఆలోచనే "వేదన" (దుఃఖం). స్వరూపజ్ఞానాన్ని తీసివేసి ప్రపంచ జ్ఞానాన్ని కలిగించి మోసం చేస్తుంది ఈ ఆలోచన.

కాబట్టి ఇది మీ ప్రపంచం అని గ్రహించి–ఆలోచించకుండా, తర్కించ కుండా– ఉన్నదున్నట్టుగా దీన్ని స్వీకరించడం నేర్చుకోండి. అప్పుడు కలిసి జీవించడం సాధ్యమౌతుంది.

> All men plume themselves on the improvement of society and no man improves.
>
> - RALPH WALDO EMERSON



## 9. నవ్వు - నవ్వించు

> There are some things that are so serious that you have to laugh at them.
>
> - NIELSBOHR (Physicist)

నవ్వుతూ తుళ్ళుతూఉండే వారంతా గుంపుగా ఒకచోటకనిపిస్తారు మీకు. అంటే! నవ్వు వ్యక్తులను దగ్గరికి తెస్తుందన్న మాట ఈప్రపంచంలో గంభీరమైనదంటూ ఏదీలేదు. చూడగలకండ్లు ఉన్నవాడికి ప్రతి దానిలోనూ హాస్యం కనిపిస్తుంది. కొందరికి మాటలను చిత్రంగా వాడటంలోనూ, వ్యక్తులను, సంఘట నలను వ్యంగ్యం, హాస్యం అనే కోణాలలో చూడటలోనూ సహజమైన ప్రజ్ఞ ఉంటుంది. అయితే మనమంతా ఆ దృక్కోణాల నుండి జీవితాన్ని చూడటం అభ్యసించవచ్చు.

**శత్రువులు లేరు :**

ఇలా నవ్వించేవారు అందరికి దగ్గరౌతారు. వారు అజాతశతృవులు (శతృవులులేనివారు) అవుతారనడంలో సందేహం లేదు. అటువంటి వ్యక్తులను నేనెరుగుదును. ఎప్పుడూ గంభీరంగాను కోపమొచ్చినప్పుడు మండిపడుతు ఆఫీసులో స్టాఫ్‌నంతా గడగడ లాడించే యముడిలాంటి ఆఫీసర్లు, మేనేజర్లు, డైరెక్టర్లు సహితం తమ ఆఫీసులోనే క్లర్కుగా పనిచేసే ఆవ్యక్తిని క్లబ్‌కు తీసుకుని వెళ్ళడం, పిక్నిక్‌కు తీసుకెళ్ళడం, తమ ఇంట్లో తమ బంధువుల మధ్య జరిగే పార్టీలకు ఆహ్వానించడం జరిగేది. చిన్న పిల్లల దగ్గరి నుండి ముసలివారి వరకు అంతా ఎప్పుడూ ఆయన చుట్టూ గుంపుగా ఉండేవారు. ఇలా అందరినీ ఆకర్షించ గలగడానికి కారణమేమిటో ఆయన మాటలు కొన్ని మీకు చెబితే అర్థమవుతుంది.

**హాస్య విధానం :**

మొదటి స్టెనో గ్రాఫర్ ఎవరో తెలుసా! "గణపతి" "షార్ట్‌హాండ్‌కు ఆపేరు రావడానికి కారణం గణపతి చేతులు పొట్టిగా ఉండటమే". "లంకా విజయం తరువాత రాములవారు పుష్పక విమానాన్ని కిష్కింధలో దింపిన తరువాత,

కిష్కింధలో ఆడవాళ్ళంతా సీతమ్మవారిని చూడటానికి వచ్చారు. ఒకరాతిమీద ఆవిడ కూర్చొని ఉంటే ముందు ముఖాన్ని చూసి ఆవిడను చూసి బాధపడి వెళ్ళిపోతూ ఇంత అందంగా ఉంది వెనకాల ఒక తోకకూడా ఉంటే ఇంకెంత బాగుండేది అనుకున్నారట". "మొన్న పాకిస్థాన్ నుండి ఒక వ్యక్తి వచ్చి ఢిల్లీలో ఒక పండ్ల డాక్టరు దగ్గర పిప్పిపన్ను పీకించుకున్నాడట అప్పుడా డాక్టర్ ఏమయ్యా! మీకు అక్కడ పాకిస్థాన్‌లో పండ్ల డాక్టర్లు లేరా? అంటే అందుకా పేషెంట్ "ఎందుకులేరు, ఉన్నారు– కానీ మాదేశంలో ఎవడూ నోరు తెరవకూడదు కదా! అన్నాడట". ఇలా సాగుతాయి ఆయన వ్యాఖ్యానాలు.

**సైడ్ ఎఫెక్ట్ :**

అయితే ఈ ధోరణిలో సాగే వారికి కష్టాలు లేవనుకోబోకండి. అల్లోపతి మందులకు మల్లే దీనికి కూడా సైడ్ఎఫెక్ట్ ఉంది. ఇలా నవ్వుతూ తుళ్ళుతూ ఉండే వ్యక్తి ఉన్నత స్థానానికి పనికిరాడని, గంభీరంగా ఉండేవారే కార్యదక్షులనే అపోహ ఒకటి ప్రజలలో ఉంది. కాబట్టి ఈ విధంగా మీరు ఉండదలిస్తే కొన్ని పదవులు, గొప్పవారనే గుర్తింపు పోగొట్టుకోవలసి రావచ్చు. మీరు నలుగురితో కలిసి జీవించడం ముఖ్యమా, లేక అహంకార పుష్టినిచ్చే పదవులు, గుర్తింపు ముఖ్యమా! మీరే ఎన్నుకోండి.

**జాగ్రత్త :**

మీ హాస్య, వ్యంగ్య సంభాషణల వల్ల మీరు మరొక సమస్యను కూడా ఎదుర్కోగలరు. మీ మాటలను ఎదుటివారు తప్పుగా అర్థం చేసుకోవచ్చు. సున్నితమైన వారి భావాలు దెబ్బతినవచ్చు, మీరు వారిని విమర్శిస్తున్నారనుకోవచ్చు. లేదా మరీ గంభీరంగా ఉండటం అలవాటయిన రాతిస్వరూపులకు మీ విధానంలో అసభ్యత కనిపించవచ్చు. కనుక ముందు వ్యక్తుల స్వభావాలను అర్థం చేసుకుంటూ సభానుగుణంగా, వ్యక్తుల కనుగుణంగా మీ హాస్యసంభాషణను కొనసాగిస్తూ కలిసి జీవించండి.

**నవ్వండి :**

అలా చమత్కారంగా మాట్లాడగల పటిమ మీలో లేకపోయినా సరే కలిసి నవ్వడం మాత్రం నేర్చుకోండి. మీ ఇష్టాయిష్టాలను ప్రక్కకుబెట్టి మీశత్రువు నవ్వించినా నవ్వడానికి సిద్ధంగా ఉండండి. అప్పుడు కలిసి జీవించడం సులభమౌతుంది.





## 10. పోటీ లేదు

"Desire of greatness is a God like sin"

**అడ్లర్ అల్లరి :**

అడ్లర్ వైయక్తిక మనోవిజ్ఞానం (Individual Psycology) అధికార వాంఛా ప్రధానమైనది. ఆయన మనుషులంతా హీనతా గ్రంధి (Inferiority Complex) కి లోనై ఉన్నారంటాడు. వ్యక్తి జీవితంలో ఎక్కడ, ఏవిధంగా, ఏస్థితిలో ఉన్నప్పటికీ నాకన్నా తక్కినవారు ఉన్నతంగా ఉన్నారని, ముందున్నారని, ఎక్కువగా కలిగి (ధనం, అందం, పేరు ప్రతిష్టలు మొ॥) ఉన్నారనే మానసిక వ్యథ వారిని విడువకుండా ఉండటమే హీనతా లేదా న్యూనతా గ్రంధి అంటే.

**ఉక్రోషం :**

మనిషి తనలో ఉన్న లోపాన్ని సరిదిద్దుకోవడం, లేదా కప్పిపుచ్చుకోవడం కొరకు మహత్వకాంక్షతో మునిగిపోతారని సిద్ధాంతీ కరించాడు అడ్లర్. చిన్నతనంలో ఏ పిల్లలయితే త్వరగా నడక నేర్చుకోరో వారే పరుగుపందాలలో గెలుపొందే గొప్ప ఆటగాళ్ళుగా వన్నెకెక్కుతారని, ఒంటికన్నువారు మామూలుగా రెండు కండ్లు ఉన్నవారికన్నా తెలివిగలవారవుతారని అనేవాడాయన. అది రెండు కండ్లతో చేయగల పనిని ఒకే కన్నుతో సాధిద్దామని ప్రయత్నించడం వల్ల వచ్చిన కపటమని, అలాగే మేము ఇతరులలాగ నడవలేమన్నారు కదా చూడండి మేము అందరికన్నా వేగంగా పరిగెత్తగలం అని చెప్పిన ఉక్రోషమని అనేవాడాయన.

**హీనత అనివార్యమా :**

అయితే తమలోని లోపాల వల్ల హీనతాగ్రంథి, దీనివల్ల అధికారవాంఛ ప్రతివారికి అనివార్యమని, దీనివల్ల ప్రపంచంలోని అడుగడుగునా ప్రజల మధ్య పోటీ తప్పదని, స్పర్థ తప్పదని దీనివల్లే ప్రజలలో కలహం సహజమని దీనిలో నుండి బైటపడటానికి అధికార వాంఛను కాస్త తగ్గించుకోవాలని ఆయన అంటారు. కానీ ఆ తగ్గించుకోవడం ఎక్కడివరకు? అనేది ప్రశ్న వాంఛఅనేది ఉన్నప్పుడు అది ఏస్థాయిలోనన్నా తృప్తిపడుతుందా? బౌద్ధికంగా ఈ విషయం అందరి అవగాహనకు వస్తే, అధికార వాంఛ అనే ఈ పరుగుపందెం ఆగిపోతుందన్నాడు అడ్లర్. కానీ ఇంత విశ్లేషణ నిచ్చిన ఆయనే స్వయంగా ఈ పోటీనుండి తప్పుకోలేకపోయాడు. తాను గురువునవ్వాలి, మార్గదర్శకుణ్ణవ్వాలి అనే వాంఛతో తన గురువైన డా॥ ఫ్రాయిడ్ నుండి తప్పుకొని, తన కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

**బహుదొడ్డ లాఓత్సే**

ఈ పోటీలో నుండి బైటపడి అంతా కలిసి జీవించే విధానం ఒకటి ఉన్నదంటాడు "లాఓత్సే" అధికార వాంఛ (Will to power) అనేది రోగం; అది ఎక్కువ ఉన్నా తక్కువ ఉన్నా ఉన్నట్లే గాని రోగరహితులుగా ఎవరూ లేరు. ఈ రోగం పోనంతవరకు అంతా స్పర్ధారహితంగా జీవించడం సాధ్యంకాదు. మరి ఇది ఎలా పోతుంది? మార్గమేమిటి?

"మహానదులు, సముద్రాలు కనుమలకు ఏవిధంగా స్వామిత్వం వహించగలిగాయి? తమను నీచస్థానంలో నిలుపుకోవడం వల్ల, క్రిందికి ఒరగడం వల్లే అవి కనుమలకు స్వామిత్వం వహించగలిగాయి. కనుక ప్రజలకు స్వామిగా మారదలచిన వాడు, వారిని అనుసరించేవాడిలాగా మాట్లాడాలి. వారి వెనుక నడవాలి. ఇలా ఉండటం వల్లే సాధువు అందరికన్నా ఉన్నత స్థానంలో ఉంటాడు; ప్రజలకు ఆయన బరువుకాడు. ఆయన అందరికన్నా ముందు నడుస్తాడు. ప్రజలు ఆయనకు హాని తలపెట్టరు". అంటాడు లాఓత్సే "తన తావో తెహకింగ్" అనే గ్రంధంలో.

**ముందా ! వెనుక? :**

అహంకారం, ఘర్షణకు, ఘర్షణ పోటీకి దారితీస్తుంది. ఈ పోటీ కారణంగానే ప్రజలు కలిసి బ్రతకలేరు. అందరికన్నా ముందుకు వెళ్ళాలి అని ప్రయత్నించేవాడు ఏ నాటికైనా ఓడిపోతాడు. తాటిని తన్నే వాడుంటే వాడి



తలదన్నే వాడుండటం కూడా సహజమే కదా! కనుక జీవితంలో ఈపిచ్చి పరుగు వ్యర్థమని గ్రహించి వెనుక నిలబడేవాడు ఎప్పుడూ విజయుడిగానే ఉంటాడు. ముందుకు వెళదామని ప్రయత్నించేవాడే నిమ్నుడుగా మిగిలిపోతాడు. పోటీలో పాల్గొనని వాడితో పోల్చడానికి ఎవరున్నారు? పోల్చబడనివాడు ఎప్పుడూ శ్రేష్ఠుడే; నువ్వు ఎలాగుంటే అలాగే శ్రేష్ఠుడివై పోతావు. నదులు నిమ్న స్థానానికి వెళ్ళడానికి, క్రిందికి ఒరగడానికి సిద్ధపడతాయి. కనుకే అవి గొప్పవైనాయి.

**పిల్లలే నయం :**

ఈ ఒరిగిపోగల కళలు పిల్లలు బాగా ఎరుగుదురు. వారి శరీరంలోని కండరాలు, ఎముకలు అన్నీ చాలా మెత్తగా ఉంటాయి. వృద్ధులు శరీరాలు పెళుసుబారిపోతాయి. నిజానికి అదే మృత్యువు యొక్క లక్షణం నది సముద్రం వైపుకు ఒరుగుతుంది. అందువల్లే అది నిరంతరం ప్రవహిస్తుంది. అలాగే వ్యక్తి కూడా అహంకార రహితుడై వినయంగా ఒరగగలిగితే నదిలాగా ప్రవహిస్తూ (జీవిస్తూ) ఉండగలడు. ఇది కేవలం శారీరిక విషయమేకాదు మానసిక విషయం కూడా. మానసికంగా తమకు తాము నిమ్నస్థానంలో నిలుపుకోగలవారే పైస్థానం నుండి వచ్చే జ్ఞాన గంగను అందుకోగలరు. ఇలా మానసికంగా ఒరగడం రాని వృద్ధులు (ఈ స్థాయిలో ఉన్నవారు ఏ వయసు వారైనా సరే వారు వృద్ధులే) నేర్చుకోవడానికి అసమర్థులు. అహంకారులంతా చివరికి జీవితంలో విరిగి ముక్కలౌతారు.

**ఓడటమే ఆనందం :**

ఎవరైనా మిమ్మల్ని వంచడానికి వస్తే మీరు ముందే ఒరిగిపొండి. వంచేవారికి ఆ మాత్రం శ్రమ కూడా లేకుండా చేయండి. చిన్న పిల్లవాడికి ఆడుకోవడానికి ఎవరూ లేకపోతే తండ్రితో కుస్తీ పడతాడు. తండ్రి వాడి ఆనందం కొరకు క్రింద పడిపోయి తాను ఓడినట్టుగా నటిస్తాడు. ఇలా అతడికి ఓడటంలోనే ఆనందం, గౌరవము ఉన్నాయి. లేదా పిల్లలతో పోటీ పడే సిగ్గు లేని వాడవుతాడు.

గెలవదలుచున్న వారంతా మూర్ఖులే, అజ్ఞానులే, ఈ గెలుపు ఏ నాటికీ శాశ్వతం కాదని వారికి తెలియదు. కేవలం గెలుచుకున్న అహంకార సంతృప్తిలో బ్రతుకుతారు వీరు. ఆ పిల్లవాడు ఏ నాటికైనా పెద్దవాడవుతాడు (ఎదుగుతాడు) ఆనాడు ఓడింది తండ్రికాదు తానేనని తెలుసుకుంటాడు. వివేకవంతుడు ప్రకృతి ప్రవాహానికి ఎదురీదడు. ఆ ప్రవాహంలో తానూ ఒకడౌతాడు.

**ముందూ - వెనుక :**

మీరు అందరికన్నా ముందు నడుద్దామని ప్రయత్నిస్తే ప్రజలు మిమ్మల్ని వెనక్కు తోసేస్తారు. కానీ ఎవరైనా ఈ పిచ్చి పోటీలో పాల్గొనక ప్రశాంతంగా వెనుక నిలబడితే చాలు మిమ్మల్ని నెత్తిన పెట్టుకుంటారు. ముందు నడవమని బ్రతిమిలాడతారు. ఇక్కడ వారి అహంకారాలు దెబ్బతినవు గనుక వారు మీకుహాని తలపెట్టరు. రాజకీయాలలోనైతే సింహాసనంమీద కూర్చునే వారిని తక్కిన వారంతా క్రిందికి లాగుదామని, హాని తలపెడదామని చూస్తారు. వారికి నువ్వు ప్రతిద్వంద్వివి కావు అనే విషయం తెలిసినప్పుడు వారు మీకు ఏ హానీ చేయరు.

కానీ ఒకవేళ అందరికన్నా ముందు ఉండటం కొరకే మీరు ప్రజల వెనుక నడుద్దామని చూస్తే మాత్రం అందరికన్నా శ్రేష్ఠుడిగా గుర్తింపబడాలనే అహంకారంతో వెనుక నిలబడటం అనే సాధనను ఆశ్రయిస్తే మాత్రం వెనుకే ఉండిపోగలరు. తనలో తాను సంతుష్టుడై గుర్తింపు కోరక వెనుక నడిచిన వారికి మాత్రం శ్రేష్ఠత్వం పరిణామంగా సిద్ధిస్తుంది.

**ఆదేశం-ఉపదేశం-సందేశం-స్వతేజం :**

ఆదేశాలు, ఉపదేశాలు, సందేశాలు ఎవరికీ నచ్చవు. ప్రజలు మిమ్మల్ని శ్రేష్ఠులుగా ఒప్పుకుంటే కదా మీనుండి ఇవన్నీ స్వీకరించడానికి, ప్రతివ్యక్తి అహంకారం అనే బురద పూసుకొని తనే శ్రేష్ఠుడిని అనుకుంటాడు. కనుక కలిసి జీవించదలచినవాడు ఆదేశాలు, సందేశాలు, ఉపదేశాలు ఇవ్వడం మానాలి. మీలో తేజస్సు పెరిగిననాడు మీరు తమకన్నా శ్రేష్ఠులనే విషయం వారికి అర్థం కాగలదు. అప్పుడు వారే మిమ్మల్ని సందేశం ఇవ్వమని అడుగుతారు. కనుక పోటీ పడటం మాని తేజస్సును పెంచుకోవడం మొదలు పెట్టండి.

**ప్రేమ - బరువు :**

శ్రీ రామతీర్థ స్వామి ఒకసారి ఒక అరణ్యంలోని పర్వతం ఎక్కుతున్నప్పుడు, ఆ కాలిబాటలోనే నాలుగేళ్ళ పిల్లవాణ్ణి వీపున ఎక్కించుకొని ముందుకు సాగిపోతున్న ఎనిమిది సంవత్సరాల పాప కనిపించింది. మామూలుగా ఒక వ్యక్తి ఆ కాలిబాటలో కొండనెక్కి వెళ్ళడమే కష్టమైతే, కేవలం ఎనిమిదేండ్ల వయసు గల ఆ పాప ఆ పిల్లవాణ్ణి ఎత్తుకొని కొండ ఎక్కడం ఆయనకు ఆశ్చర్యాని కలిగించింది. "పాపా! ఆ పిల్లవాడు నీకు బరువు కావడం లేదా?" అన్నాడు. ఆ పాప "వీడు నా తమ్ముడు, మరి నాకెలా బరువవుతాడు!"అన్నదట.



తప్పని పరిస్థితిలో ఏదైనా వస్తువును నెత్తి నెత్తుకోవాల్సి వస్తే అది మనకు చాలా బరువవుతుంది. కానీ అదే మనం ఇష్టపడి ప్రేమతో ఆ బరువెత్తుకుంటే అది మనకు భారంకాదు. అలాగే మనంతట మనం ఎవరి నెత్తినన్నా ఎక్కి కూర్చుంటే వారికి బరువవుతాము. కానీ అదే వారు ప్రేమతో నెత్తి నెత్తుకుంటే (తమకన్నా ఉన్నత స్థానంలో కూర్చోబెట్టుకుంటే) బరువయ్యే ప్రసక్తే లేదు. కనుక ప్రేమ పెంచుకోండి? ఎవరికీ బరువు కాకుండా అందరితో కలిసి బ్రతకవచ్చు.

**నీడలు - ఘర్షణ :**

"Then the people of the world are glad

No one in the world can contend against him"

"ఆ తరువాత ప్రపంచ ప్రజలు ఆనందంగా ఉంటారు, ఆయనకు వ్యతిరేకంగా ఎవరూ సంఘర్షణ చేయలేరు".

– తావో తెహకింగ్

రిన్ ఘూయీ అనే జెన్ తత్వవేత్త నీడలనుగురించి ఒక పాట వ్రాశారు. "మెట్ల మీది చెట్టు నీడ చిమ్ముతోంది. (ఊడుస్తోంది) అయినా దుమ్ము లేవడం లేదు; సరస్సు మీద కొంగలు ఎగురుతున్నాయి వాటికి తమ ప్రతిబింబం నీళ్ళలో కనిపించాలని లేదు; సరస్సుకు వాటికి ప్రతిబింబించాలని లేదు అయినప్పటికీ ప్రతిబింబాలు తయారవుతూ మళ్ళీ అంతమవుతూ ఉంటాయి".

ఇలా జీవించడం నేర్చుకోండి. ఆకాశంలో ఎగిరే పక్షికి పదచిహ్నాలు ముద్రించబడవు. అలాఎవరితోనూ ఘర్షించని నీడలలాగా వర్తించినప్పుడు, సూక్ష్మమైన హింసా వృత్తులను కూడా విడిచి పెట్టినప్పుడు పోటీ ఉండదు అప్పుడు కలిసి జీవించడం సులభమౌతుంది.

## 11. కలిసి పనిచేయడం ఒక కళ

**"తరువాత చేయబోయే కార్యమేమిటో తెలుసుకోవడమే వివేకం; దానిని సరిగా చేయడం నైపుణ్యం; దానికి పూర్తి చేయడం సద్గుణం".**

**పని :**

బరువైన ఒక బల్ల ఒక వ్యక్తి లేపగలడా? లేపలేడు అందుకు కనీసం నలుగురు కావాలి. మరి ఆ నలుగురు ఒకే పక్కన పట్టి లేపితే ఆ బల్ల లేస్తుందా?... లేవదు, నలుగురు నాలుగువైపులా పట్టాలి. నలుగురూ నాలుగువైపులా పట్టినప్పటికీ అంతా ఒకేసారి పట్టి లేపకపోతే అది లేస్తుందా? లేవదు. అంటే దీని వల్ల నలుగురు కలిసి ఒకేసారి నాలుగువైపులాపట్టి ఒకేసారి ఆ బల్లను అక్కడి నుండి లేపి అవసరమైన మరోచోటికి తీసుకువెళ్ళి పెట్టాలి అనే సంకల్పంతో పనిచేసినప్పుడే పని అవుతుందన్నమాట.

నలుగురు కలిసి పనిచేయడాన్ని "సహకారం" (Co-operation) అంటారు. నలుగురు కలిసి పనిచేయాలనే ఆలోచన కలిగి ఉండటాన్ని "భావ సహకారం" (Thought Co-operation) అంటారు. నలుగురు కలిసి పనిచేయడానికి సిద్ధపడటాన్ని "సామాజిక సహకారం" (Social Co-operation) అంటారు. నలుగురిని నాలుగువైపుల బల్ల లేపడానికి నియమించడాన్ని "సమన్వయం"(Co-ordination) అంటారు. నలుగురు నాలుగు వైపుల పట్టి లేపడాన్ని "దేశ సమన్వయం" (Spacial Co-ordination) అంటారు. నలుగురు నాలుగువైపుల పట్టి ఒకేసారి లేపడాన్ని "కాలసమన్వయం" (Timely Co-ordination) అంటారు

ఇదీ కలిసి పనిచేసే కళ



## 12. తరాలు - అంతరాలు

**కొత్త సత్యాలను ప్రతిపాదించడం కష్టంకాదు. పాత దురలవాట్లను తొలగించడమే దుర్లభం. మనుషులు స్వాభావికంగా కొత్తవాటికి స్వాగతం చెబుతారు. కానీ పాతవాటిని వదులుకోరు."**

**విజ్ఞానం :**

ఇది విజ్ఞాన విస్ఫోటనయుగం. సైన్స్ వేగంగా అభివృద్ధి చెందుతున్న తరం ఇది. ఒకప్పుడు గుఱ్ఱంమీద గంటకు 25 కి.మీ వేగంతో ప్రయాణించిన మానవుడు, ఇప్పుడు 30 వేల కి.మీ పైబడిన వేగంతో రోదసిలో ఉపగ్రహాలను తిప్పుతున్నాడు. వార్తను ఒక ప్రాంతం నుండివేరొక ప్రాంతానికి చేర్చడానికి కొన్ని నెలలు పట్టేరోజులు వెళ్ళిపోయి, భూమిమీద ఎక్కడో వేలమైళ్ళ దూరంలో జరిగే విషయాన్ని సెటలైట్ల ద్వారా ప్రత్యక్ష ప్రసారాలు చూసే రోజులు వచ్చాయి

**ఘర్షణ :**

వృద్ధులకు ఈ ప్రంచంలో విలువలన్నీ అడుగంటిపోతూ కనిపిస్తున్నాయి; మధ్యవయస్కులు కొత్తపాతల మధ్య ఊగిస లాడుతున్నారు. యువతరానికి తక్కిన వారు ఛాదస్తులు, అడవి మనుషులుగా కనిపిస్తున్నారు.

**తలోదారి :**

వృద్ధులు, మార్పులను ప్రతిఘటిస్తారు, యువకులు కొత్త మార్పుల కొరకు పరితపిస్తారు. వృద్ధులు ఉమ్మడి కుంటుంబ వ్యవస్థ శిథిలమైపోతోందని పరితపిస్తుంటే, యువకులు ఒంటరి తనం లభించడంలేదని బాధపడతారు. ఈ మార్పును జీర్ణించుకొని యువతరానికి దగ్గరవ్వాలో లేక సనాతన వ్యవస్థకు పట్టంగట్టి పై తరాన్ని గౌరవించాలో తెలియక నలిగిపోతారు మధ్య వయస్కులు.

**సమన్వయం :**

పల్లెలలో బ్రతికినవారు మహానగరాలలో ఉక్కిరిబిక్కిరవడం సహజం. వారి నర్థం చేసుకొని మెలగడానికి యువతరం ప్రయత్నించాలి. తాము మారకపోయినా ఫరవాలేదు గాని యువతరానికి ప్రతిక్షణం అడ్డుపడుతూ, తాము బ్రతికినట్లే వారిని బ్రతకమనకుండా ఉండాలి పెద్దతరం.

మార్పులను అవసరాన్ని గుర్తించి,వాటి స్వభావాన్ని అర్థం చేసుకొని, వాళ్ళ ఆలోచనలను,ప్రవర్తననూ ఆయా పరిస్థితులకు అనుగుణంగా సమన్వయం చేసుకోగలగాలి మధ్యతరం.

**వ్యాపార సరళి :**

కేవలం నమ్మినంత మాత్రాన ఇంతకు మునుపు చేయని పనులు కొత్తగా చేయడం కష్టమంటారు గానుగెద్దులాంటి మనుషులు. మారదలచుకున్నవాడు ముందు పాత అలవాట్లను వదులుకోవడానికి సిద్ధపడాలి. మనమంతా కొత్త జీవన సూత్రాలను వెతుకుతూ బయలుదేరుతామే గాని తెలిసినవాటిని ఆచరించడానికి ప్రయత్నించం. ఈ బలహీనతను ఆధారంగా చేసుకునే పాతసబ్బులు, పేస్టులకు కొత్తది (New)అని వ్రాసి అమ్ముకుంటారు వ్యాపారవేత్తలు.

**ఎలా నమ్మడం :**

ఒకసారి ఒకవ్యక్తి కాలుజారి ఒక లోయలో పడిపోతూ చేతికి దొరికిన ఒక ఊడను పట్టుకున్నాడు. క్రిందికి చూస్తే అగాధం పైకి చూస్తే ఆకాశం. ఏం చేయాలో దిక్కుతోచకుండా ఉన్న అతడు "ఎవరన్నా నన్ను రక్షించేవారున్నారా" అన్నాడు. ఇంతలో "నా పైన నీకు విశ్వాసం ఉంటే పట్టుకున్న ఆ ఊడను విడిచిపెట్టు" అనే గంభీరమైన వాణి ఆ లోయలో ప్రతిధ్వనించింది. వెంటనే ఆ వ్యక్తి "ఇంకెవరన్నా ఉన్నారా" అన్నాడు.

**సాగిపోండి :**

అందుకే భూతకాలపు విలువలనే విశ్వసించాలా! లేక వర్తమానపు విలువపై ఆధారపడాలా? లేక కొత్త పాతలలో ఏది ఉత్తమం అనిగానీ ఆలోచించక ఎదుటి తరంస్థానంలో నిలిచి వారి స్థితిగతులను అర్థం చేసుకొని ఏది అవసరమో, ఏది అనవసరమో గ్రహించి, అనవసరమైన దాన్ని విడిచిపెట్టి అవసరమైన దాన్ని స్వీకరిస్తూ అందరితో కలిసి బ్రతకవచ్చు.

> **Science and faith should be resolved not in terms either of elimination or duality but in terms of synthesis.**
>
> **- Teithard de chardin**





## 13. A,B,C లు

" To live is to have problems and to solve problems is to grow intellectually"

- J.P Guild ford (psycologist

'A' అంటే Activities (పనులు), 'B' అంటే Behaviour (ప్రవర్తన),'C' అంటే Consequences (ఫలితాలు). ఇవి మూడుసరిగ్గా ఉంటే కలిసి పనిచేయడం సులభమౌతుంది.

**పనులు :**

పనులు (Activities), చేయించే వాడి (Activator) మీద ఆధారపడి ఉంటాయి. అందరితో పనిచేయించడం కన్నా ముందు అతడు (పనిచేయించేవాడు) పనిచేయాలి. అతడు చేయవలసిన పనులు వరుసగా 1. గమ్యాన్ని నిర్ణయించడం,2. పనిచేసే స్థలాన్ని, సమయాన్ని నిర్ణయించడం, 3. పనిచేసే విధి విధానాన్ని నిర్ణయించడం.

**ప్రవర్తన :**

పనిచేసే వారి ఆలోచనలు భావాలు, ప్రవర్తన (Behaviour) గా పేర్కొన బడవు. ప్రవర్తనకు ఇవి మూలమైనప్పటికీ చేసే పనులే ప్రవర్తనగా చెప్పుకోబడ తాయి. దీనిని పనిచేయించే వాడు 1. ఆశించదగినది,2. ఆశించకూడ నిది అని రెండుగా విభజించుకోవాలి. ప్రవర్తన (Behaviour) పనిచేయించేవాడి (Activator) విధివిధానంపైన మరియు పనిచేసే వ్యక్తి (Worker) పైన ఆధారపడి

ఉంటాయి. చాలామంది గమ్యాన్ని నిర్ణయించి, వర్కర్లకు పనులు వప్పచెప్పి ఫలితాలను ఆశిస్తూ కూర్చుంటారు. తన విధి విధానం సరియైనది అవునో కాదో తెలుసుకోవడానికైనా లేక పనివాడుసరిగ్గా పనిచేస్తున్నాడో లేదో చూడటాని కయినా అతడు పనిని పర్యవేక్షించాలి ఆ పర్యవేక్షణలో కేవలం వర్తమానంలో పని సరిగ్గాజరిగిందా లేదా చూడటమే (Observe) కాదు, ఇలాసాగితే అంతవరకు ఆశించిన గమ్యం చేరగలమా లేదా అనే విషయాన్ని లెక్కించాలి (measure) కూడా.

**ఫలితాలు :**

ఈ రెండు "చూడటం, లెక్కించడం" (observe and measure) సరిగా చేసిన వారికి ఎలా ప్రతిస్పందించాలో (Respond) తెలుస్తుంది. ఈ ప్రతిస్పందననే ఇక్కడ ఫలితం (consequence) గా చెప్పారు. ఇవి ఆ పనివారు పొందే ఫలితాలు. ఆశించదగిన ప్రవర్తన ఉన్నచోట పొగడ్త (praising) ను,ఆశించగూడని ప్రవర్తన ఉన్నచోట చీవాట్ల (Reprimands) ను ఫలితాలుగా ఇవ్వాలి.

**గుడ్డివాడు :**

ఈ ప్రతిస్పందన విషయంలో నిర్ణయాలు తీసుకోవడం చాలా కష్టం. ప్రవర్తనను పనిని బట్టి పొగడ్తలు,చీవాట్లు అని కాకుండా మానేజర్లు తమ మూడ్‌నుబట్టి అందరికి చీవాట్లు వేయడమో, పొగడడమో చేస్తుంటారు ఇది గుడ్డివాడి కథలాంటిది...ఒక గుడ్డివాడు తన పెంపుడు కుక్కను తీసుకొని వెళుతున్నాడు. వారు రోడ్డు దాటే చోట ట్రాఫిక్ ఎక్కువగా ఉండటంతో ఆగి పోయారు. కుక్కకాలు లేపి గుడ్డివాడి కాలుమీద మూత్రం చేసింది. వెంటనే గుడ్డి వాడు జేబులోంచి ఒక బిస్కట్ తీసిదానికి అందించబోయాడు. ఇదంతా చూస్తున్న ఒక వ్యక్తి అతడి దగ్గరికి వచ్చి "మీ మీద మూత్రం చేసిన కుక్క మీరు బిస్కెట్ తినిపించబోవడం నాకు ఆశ్చర్యాని కలిగిస్తోంది." అన్నాడు. గుడ్డివాడు నవ్వుతూ, "అది బిస్కెట్ అందుకోవడానికి వస్తే గాని అది ఎక్కడుందో నాకు తెలియదు కదా? అలా దగ్గరికి వచ్చినప్పుడు తందామని అన్నాడు. అచ్చం ఆగుడ్డివాడు చేసిన పనిలాగే ఉంటుంది. కొందరు మేనేజర్ల వ్యవహారం.

**శిక్షణ - ప్రవర్తన :**

పనిచేసేవారిలో ఆశించదగని ప్రవర్తన కనిపించినప్పుడు అంటే వారి పనిలో లోపాలు కనిపించినపుడు, వారు నిజంగా పని చేయలేకపోతున్నారా



(Can't do) లేక చేయడం లేదా (Won't do) అనేది గ్రహించాలి. చెయ్యలేక పోతున్నారు అంటే అది శిక్షణలో లోపం, ప్రవర్తన నుండి మళ్ళీ పనులలోకి అంటే గమ్య నిర్ధారణలోకి, శిక్షణావ్యాసంగంలోకి వెళ్ళాలి. చెయ్యగలిగి ఉండి చెయ్యటం లేదని గ్రహిస్తే చీవాట్లు వేయాలి. పని నేర్చుకుంటున్న వారివల్ల లోపాలు జరిగితే వారిని గుద్దించవద్దు; గద్దించినట్లయితే వారు తమపైనునన్న నమ్మకాన్ని, మీపై విశ్వాసాన్ని కోల్పోయి అభద్రతా భావనకు(Insecurity feeling) లోనవుతారు. వారి శిక్షణలో ముఖ్యమైనవి.

1. ఏం చేయాలో చెప్పండి (Tell what to do)
2. ఎలా చేయాలో చూపండి (Show how to do)
3. అతడికి ప్రయత్నించే అవకాశం ఇవ్వండి.(Let the person try)
4. అతడి పనిని వీక్షించండి (Observe the performance)
5. ప్రగతిని మెచ్చుకోండి లేదా మరల మార్గదర్శనం చేయండి. (Praise the progress or Redirect)

ఒకవేళ మళ్ళీ మళ్ళీ శిక్షణ ఇచ్చినప్పటికీ ఆ పనివాడు పొరపాట్లు చేస్తుంటే ఆ రకమైన పనిచేయడానికి అతడు సమర్థుడు కాదని గ్రహించండి. వారికి వేరే రకమైన పని వప్పచెప్పండి.

**వెన్నుతట్టడం :**

"Only positive consequences encourage good future performance"

మనస్తత్వశాస్త్రం వెన్నుతట్టగానికి ఎంతో ప్రాధాన్యతనిస్తుంది. పసితనం నుండి మొదలుకొని వృద్ధాప్యం వరకు వయోభేదంలేకుండా అందరిని వెన్నుతట్టాలి లేదా వారి ప్రగతి ఆగిపోతుంది అంటుంది మనస్తత్వశాస్త్రం.

తాను చేసిన పనికి తన పై అధికారి నండి ఎటువంటి స్పందన రాకపోతే క్రమంగా ఆవ్యక్తికి పనిచేయడం కష్టమౌతుంది. ఇలాగే చాలాసార్లు జరిగితే అతడు తన కర్మ కౌశల్యాన్ని విడిచిపెట్టగలడు. అతడు తాను చేస్తున్న పనిని ప్రేమించనంత వరకు; కర్మను ఇష్టపడి ఆటగా స్వీకరించి అందులో ఆనందించ నంతవరకు; తాను చేసిన పనికి ఫలితంగా మంచి జీతంతో బాటుగా పొగడ్తలను, పై అధికారుల నుండి గుర్తింపును,ప్రతిక్షణం వీపు నిమరబడటాన్ని కోరుకుంటాడు.

85 శాతం స్ఫూర్తి పనివారి నుండి ఫలితాల నుండి గాక పై అధికారుల నుండే వస్తుంది. అందుకే పనివారి శిక్షణకు వినియోగించే సమయానికన్నా పదిరెట్ల ఎక్కువ సమయం వారి వెంట ఉండి వారికి స్ఫూర్తినివ్వడానికి వెచ్చించాలి.

" As a Manager the important thing is not what happens when you are there but what happnes when you are not there"

"యజమానిగా నీ సమక్షంలో ఏం జరుగుతుందనేది ముఖ్యం కాదు,నువ్వు లేని సమయంలో ఏం జరుగుతుంది అనేది ముఖ్యం".

మీరు లేని సమయంలో కూడా మీ ప్రభావం అంతగా వారిపై ఉండాలంటే మీరు ఇచ్చిన స్ఫూర్తితో వారు ఉక్కిరి బిక్కిరవ్వాలి.

**చీవాట్లు పెట్టే కళ :**

When you end a reprimand with a praising people think about their behaviour not your behaviour

నిజమైన పనిమంతులు తప్పుచేయరు చేసినా ఇతరుల దృష్టి దానిమీద పడకముందే దాన్ని సరిదిద్దుకుంటారు. ఒకవేళ వారు తమ తప్పును గ్రహించలేక పోతే కోప్పడటం అవసరమే కాని ఆ గద్దించడం అతడి మనస్సును తన లోపం వైపుకు తిప్పి దాన్ని సరిచేసుకునేదిగా చేయాలి గాని, కోప్పడినవారి కోపం గురించి ఆలోచించేదిగా ఉండకూడదు. "నువ్వు చాలా బాగా పనిచేయగలవు గానీ, ఇలాంటి తప్పులు రాకుండా చూసుకుంటే ఇంకా బాగుంటుంది" అనాలి. ఒకవేళ తనసాటి పనివారితో మేనేజర్ కోపాన్ని గూర్చి మాట్లాడదామని చూసినా;వారు "ఆయన నీ పని బాగున్నదనే అన్నాడు, కాకపోతే మళ్ళీ ఆ పొరపాటు జరగకుండా ఉండాలన్నాడు దానికింత బాధపడతావెందుకు!" అంటారు

**ఇది నీ ఇల్లు :**

మా మిత్రుడు 15 సం॥ పిల్లవాడు తండ్రి జేబులో నుండి డబ్బులు తీస్తూ పట్టుబడ్డాడు. స్నేహితులతో కలిసి సినిమాకు వెళ్ళడానికి వాడా ప్రయత్నం చేసినట్టు తెలిసింది. ఆయన కొడుకుతో "ఇది నీఇల్లు, ఈ డబ్బు నీది, దీనికోసం నువ్వు దొంగతనం చేయాల్సిన పనిలేదు. కానీ డబ్బును జాగ్రత్తగా ఖర్చు పెట్టడం నేర్చుకో; ఏ మిత్రుల కోసం నీ ఇంట్లోనే నువ్వు దొంగతనం చేద్దామనుకున్నావో,ఆ మిత్రులు నీ కొరకు ఏం చేయగలరో పరీక్షించు" అంటూ ఆడబ్బు ఇచ్చి కొడుకును పంపించాడు ఆయన,కొడుకు ఆతరువాత దొంగతనం చేయలేదు వివేకంతోఖర్చుపెట్టడం



నేర్చుకున్నాడు. ఆనాడే కనుక తండ్రి కొడుకును తిట్టినా, దండించినా, పిల్లవాడు మనసులో తండ్రిపై కోపం పెట్టుకుంటాడే గాని తనతప్పు తెలుసుకొని ఇలామారడు.

**చర్చా - వాదాలు :**

వారి లోపాన్ని గూర్చి వివరించేప్పుడు, పనివారు లేదా కొడుకులు వాదించడం మొదలుబెడితే "నువ్వు దీన్నిగూర్చి చర్చించదలచుకుంటే తరువాత తీరికగా మనం ఇద్దరం కూర్చుని మాట్లాడదాము ప్రస్తుతం నేను చెబుతున్నది విను" అని చెప్పండి




మేనేజరు నిర్ణయించిన గమ్యం (పనులు) శిక్షణ, పని చేసేవారి సరియైన ప్రవర్తనకు అది సరియైన ఫలితాలకు దారి తీస్తుంది. మళ్ళీ ఫలితాలు ఉత్తమ లక్ష్య నిర్ణయానికి (పనులు) దారితీస్తుంది. ఒక్కొక్కసారి ఆశించిన ప్రవర్తన కనిపించనప్పుడు B (ప్రవర్తన) నుండి A (పనులు) కు వెళ్ళి మళ్ళీ శిక్షణ నివ్వవలసి ఉంటుంది. లేదా 'C' అంటే పొగడటం, గద్దించటం ద్వారా A.B పనులు ప్రవర్తనల వైపుకు వెళ్ళవచ్చు. ఈవిధంగా A.B,C లను చక్కగా అర్థం చేసుకొని ముందుకు సాగడంవల్ల కలిసి జీవించే కళ అబ్బుతుంది.

## 14. కలిసి జీవించడానికి చిట్కాలు

**1. దోషారోపణ చేయకండి :**

విషయం పూర్తిగా ప్రమాణపూర్వకంగా నిరూపించబడనంత వరకు ఎవరిపైనా దోషారోపణ చేయకండి.

Judge not according to the appearence

పైన కనిపించేదే సత్యం కాదు.

**2. వాడకండి :**

"నీ మొహం చూపించకు!" "నీ మొహం చూడదలచుకోలేదు!" "నువ్వు ఇట్లా చేస్తావనుకోలేదు!" "నిన్ను చూస్తే నాకు అసహ్యం పుడుతోంది!" లాంటి పదాలు ఎట్టి పరిస్థితిలోనూ వాడకండి.

Man is a stream whose source is hidden

ఏ పుట్టలో ఏ శేషుడున్నాడో ఎవరికెరుక.

**3. వ్యతిరేకం :**

ప్రతివాడు తన ఆలోచన గొప్పదనే అనుకుంటాడు. ఏదో ఒకరకంగా దాన్నే గొప్పదిగా నిరూపించడానికి ప్రయత్నిస్తాడు. కనుక మీ అభిప్రాయాన్ని అందుకు వ్యతిరేకంగా ఎప్పుడూ నిలపకండి. అతడి ఆలోచనలో సత్తా లేకపోతే అదే సహజంగా అంతం కాగలదు.

**4. విమర్శ :**

సాధ్యమైనంతవరకు ఎవరినీ విమర్శించకండి. అవసరమైతే ఏకాంతంలోనే ఆ పనిచేయండి.



**5. బురద :**

The fellow that throws mud always ends up with a pair of dirty hands

ఇతరుల పైకి బురదచల్లే వ్యక్తి చేతులకు ముందు మైల అంటుకుంటుందని గ్రహించండి. అదే వెనక్కి తిరిగిరావచ్చు కూడా.

**6. ఫ్లాష్ లైట్ల ముందు :**

సాధ్యమైనంతవరకు ఫలితం యొక్క గొప్పతనాన్ని ఇంకొకరి మీదికి తొయ్యండి. ఎత్తయిన వేదికనెక్కినలుగురి దృష్టిలో పడకండి. ఆ క్షణంలో ఆ సన్మానం ఎంతో ఆనందాన్ని ఇచ్చినా, భవిష్యత్తులో ఇబ్బందులు కలుగజేస్తుంది.

**7. పోట్లాట :**

సాధ్యమైనంతవరకు పోటీలు, పోట్లాటలు మానండి. సామాన్యంగా వీటిలో ఎవరూ గెలవడంగానీ ఓడటంగానీ జరుగదు. కాస్త మీ అహాన్ని దిగమింగటానికి ప్రయత్నించండి. కాస్త ఎదుటి వాడివైపు నుండి కూడా ఆలోచించండి. అతడి సమస్యలు, భయాలు కూడా అర్థం చేసుకోండి. మొదట్లో అతడు మీ ఔదార్యాన్ని అర్థం చేసుకోలేకపోవచ్చు. కానీ క్రమంగా అతడు కూడా దారికి రాగలడు.

**8. కలిసి ఒక పనిని సాధించాలంటే :**

1. అసలు మీ గమ్యం ఏమిటో, అందరికీ స్పష్టంగా చెప్పండి. గమ్యం యొక్క స్పష్టమైన అవగాహన లేకే చాలా పనులు దెబ్బతింటాయి.
2. మొత్తం పనిని విభజించి ఏయే విభాగంలో పని ఏ రీతిలో ఉంటుంది; అందులో ఏ పనికన్నా ఏది కఠినమైందో వివరించండి. సంసిద్ధత వల్ల వారికి వారిపైన విశ్వాసం కలుగుతుంది.
3. అందరికీ మళ్ళీ ఒకసారి మొదటి విభాగపుపనిని వివరించండి. (ప్రతి విభాగపు పని ప్రారంభంలోనూ ఈ వివరణ ఉండాలి) పనిని విభజించి వారందరికీ వప్పగించండి.
4. ఎవరు చేయవలసిన పని యొక్క బాధ్యతను వారికి వప్పగించండి. లేదా వారు ఇతరుల పనిలో కలిగించుకోవడమో లేక తమ బాధ్యతారాహిత్యాన్ని తమ పనిలో లోపాన్ని ఇతరుల నెత్తిన రుద్దటమో జరుగుతుంది.

5. పనికి కావలసి వస్తువులు, ఉపకరణాలు అవసరమైన చోట సర్దిపెట్టండి. వాటికి ఆస్థలాలు నిర్దేశించి అందరికీ చెప్పండి. ఎవరు వాటిని వాడినా మళ్ళీ శుభ్రంగా భద్రంగా వాటిని వాటి స్థానాలలో పెట్టే విధంగా క్రమశిక్షణ నేర్పండి.

6. మీ ముఖంలో చిరునవ్వు, విశ్వాసము చెరిగిపోకుండా ఉంచండి. తక్కినవారికి అది స్ఫూర్తినిస్తుంది. ఇక మీరంతా కలిసిచేసే ఆపని తప్పక సంపూర్ణం కాగలదు

మీరు పాటించని నియమాలను ఇతరుల నెత్తిమీద రుద్దకండి. ఎవరూ నియమాలకు అతీతంకాదు అనే విషయం అందరికీ అర్థమైతే, ఎవరూ చెప్పకుండానే ఆ నియమాలు ఆచరణలోకి వస్తాయి. అంతేకాని బలవంతంగా ఏ నియమాలను ఇతరులచేత ఆచరణలో పెట్టించలేము.

**10. పట్టుదల :**

మీరు ఎన్ని కష్టాల మధ్య ఉన్నాసరే,ఎంత అనారోగ్యస్థితిలో ఉన్నాసరే ఇచ్చిన మాట నిలబెట్టుకోండి. తక్కినవారు అలా మీకిచ్చిన మాట నిలబెట్టుకోక పోవచ్చు గానీ మీ ప్రవర్తనను బట్టి క్రమంగా వారూ మారగలరు.

**11. దేనిలో దోషం ?**

అంతా కలిసి చేసినపనిలో ఎక్కడయినా లోపాలు వస్తే, నష్టాలు వస్తే, ఇబ్బందులు కలిగితే, లోపం ఎక్కడ ఉందో (పద్దతిలో, వాడిన పదార్థాలు, వస్తువు లలో, నియమాలలో,అందరికీ అందిన సూచనలలో మొదలైన) చూడండిగాని ఎవరిలో (ఏవ్యక్తిలో) ఉంది అని చూడకండి. అలా చూడటంవల్ల భవిష్యత్తులో ఆవ్యక్తి సహకరించకపోవచ్చు.

**12. ఉద్రేకం వద్దు :**

కష్టం నష్టం వాటిల్లినప్పుడు ప్రశాంతంగా ఉండండి. లేదా ఆ దుఃఖపూరిత, ఉద్రేకపూరిత వాతావరణం మీ ఉద్రేక కోపతాపాలచేత పెరుగుతుందే గాని తగ్గదు.

**13. అగాధం :**

వ్యక్తుల మధ్య సంబంధాలు ఒకేసారి దెబ్బతినవు అవి సూక్ష్మంగా ప్రారం భమై క్రమంగా అభివృద్ధి చెందుతాయి. వాటిని మొదటినుండి గుర్తించడం నేర్చు



కోండి లేదా ఒక శుభోదయాన మీకూ మీ చుట్టూ ఉన్నవారికి మధ్య ఒకేసారి పెద్ద అగాధం కనిపిస్తుంది.

**14. వీపు తట్టడం :**

అంతా చక్కగా గడిచిపోతూ ఉంటే ఎప్పుడూ ఇలాగే ఉంటుందనుకోకండి. ఏ సమస్యలు లేకపోయినా యాంత్రికమైన జీవితంతో విసుగుచెందటంవల్ల కూడా ఇబ్బందులు ప్రారంభమౌతాయి కాబట్టి ప్రజలను వెన్నుతట్టడం మరువకండి.

**15. మార్పు :**

వెన్నలాగా కరగడం (Be flexible) నేర్చుకోండి. ప్రజల పద్ధతులు, ఆలోచనలు,అలవాట్లు వాతావరణం అన్నీ మారుతున్నాయి. కలిసి ఉండదలిస్తే మీరు కూడా వాటితోపాటుగా మారడం నేర్చుకోండి.



**16. ప్యాక్ చెయ్యకండి :**

ఎవరికి వారికి వారి వారికి చెందిన విషయాలు మాత్రమే చెప్పి ఎవరి గదులలో వారిని బంధించడం కన్నా అంతా కలిసి సాధించాల్సిన గమ్యం గురించి అందరికీ స్పష్టమైన అవగాహనను కలిగించి ఆ తరువాత వారికి వారి బాధ్యతలను వప్పజెప్పడం మంచిది.

**17.బాధ్యత - అధికారం :**

యోగ్యులకు బాధ్యతలతో బాటు అధికారాలు కూడా పంచి ఇవ్వండి (De-Centralise) లేదా వారు తమ సామర్థ్యాన్ని చూపలేరు.

**18. రహస్యం :**

చాలా విషయాలు వివరించి చెప్పడం వల్ల కలిసి పని చేయడం సాధ్యమౌతుంది. కానీ ఒక్కొక్కసారి కొన్ని దాచిపెట్టడం కూడా అవసరమౌతుంది.

**19. తరువాత లోపం :**

ఎదుటివారు చెప్పేది తాను అర్థం చేసుకోగలనని చెప్పండి. వారి కోణం నుండి తాను చూడగలుగుతున్నానని వివరించండి. ముందు వారితో ఏకీభవించిన

విషయం ఏమిటోచెప్పండి; తరువాత సహనంతో వారికి లోపం ఎక్కడుందో వివరిం చండి. ఒకేసారి వారి లోపం చెబితే వారు వినరు, మీతో సహకరించరు.

**20. చివరిసారిగా ఈ మాట వినండి :**

మీకు ఈ ప్రపంచంలో సర్వసద్గుణ సంపన్నులైన వ్యక్తులు లభించరు– మీరు కూడా అంత గొప్పవారు కారు. కొందరు మూర్ఖులు, కొందరు నమ్మదగనివారు, మరికొందరు మోసకారులు, కొందరు మాట ఇచ్చి నిలుపుకోనివారు మీకు లభిస్తారు.సహనంతో వారితో కలిసి జీవించడానికి సిద్ధపడండి. ఆ సంసిద్ధతే మిమ్మల్ని ముందుకు నడుపుతుంది.

## ఈ పుస్తక రచనలో నాకు స్ఫూర్తి నిచ్చిన గ్రంథాలు

(వీలైతే మీరూ చదవండి)

1. How to get to the top. (Edward J. Hegarty)
2. How to get to the top.
   ( C. Northote Parkinson - M.K. Rustomji)
3. How to read a person like a book
   (Gerald I. Nierensberg and Henry H. Calero)
4. Putting the one Minute Manager to work.
   (Kenneth Blanchard & Robert Lorber)
5. మారుతున్న సమాజంలో ఎవరు ఎందుకు ఎలా వ్యవహరిస్తారు?
   (కె.రామిరెడ్డి)





## 15. సమస్యలు దుఃఖాల బరువు

"సమస్యలు అరువు తెచ్చుకునే వారు చెల్లించే వడ్డీ దుఃఖం"

– జార్జ్ వాషింగ్టన్.



**పరస్పరం**

దుఃఖపూరితమైన మీచెడు దినాన్ని గూర్చి ఎప్పుడూ చెప్పకండి. మీ సమస్యలను ఇతరులకు ఏకరువు పెట్టకండి. మీరు ఎదుటివాడికి అవకాశం ఇచ్చిన వారవుతారు. ప్రతివాడు తన మానసికమైన బరువును ఇంకొకడి నెత్త మీదికి మారుద్దామని చూస్తాడు.

**టీ తాగించాలి :**

మీలో ఎవరు తన సమస్యలు, దుఃఖాల విషయం మాట్లాడతాడో అతడు తక్కిన వారికి టీ తాగించాలి. అనే నియమం ఒకటి పెట్టండి. దానితో ఎవరూ నోరెత్తరు. (అవసరాన్ని బట్టి నియమంపెంచుతూ వెళ్ళండి)

**ఏం జరుగుతుంది ?**

మీరు మీ కష్టాలను,దుఃఖాలను గూర్చి ఆలోచిస్తే,మాట్లాడితే...

**ఆలోచించడం వల్ల :**

1. మీ ఆరోగ్యం చెడిపోతుంది
2. మీపై మీరు విశ్వాసం కోల్పోతారు

